# RAMARAJIYAMU

OR

# NARAPATIVIJAYAMU

## BY VENKAYYA

EDITED FOR THE FIRST TIME
BY
GUSTAV OPPERT, PH.D.,
Prof. of Sanskrit and Comparative Philology, Presidency College, Madras.



V. RAMASWAMY SASTRULU & SONS
292, ESPLANADE, MADRAS.

# RAMARAJIYAMU

OR

# NARAPATIVIJAYAMU

BY VENKAYYA

EDITED FOR THE FIRST TIME

BY

GUSTAV OPPERT, PH.D.,
Prof. of Sanskrit and Comparative Philology, Presidency College, Madras,



V. RAMASWAMY SASTRULU & SONS
292, ESPLANADE, MADRAS.

# ఆంధ్ర గ్రంథములు.

---

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మార్కండేయపురాణము, మారనకృతము .... | 1 | 12 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నాము .... | 2 | 8 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీచినసీతారామస్వామిశాస్త్రికృతము అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు .... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము .... | 3 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు .... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు .... | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు .... | 1 | 0 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు .... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర .... | 1 | 8 |
| హరవిలాసము .... | 1 | 8 |
| ,, | | |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము .... | 0 | 12 |
| నరసభూపాలీయము, అట్టబైండు .... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి .... | 0 | 10 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి నారాయణకవిప్రణీతము .... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు, రామభద్ర కవికృతము | 0 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము.... | 0 | 6 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము .... | 0 | 4 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము.... | 0 | 12 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము .... | 0 | 8 |
| | 1 | 4 |

రామరాజీయము.

# RAMARAJIYAMU

OR

# NARAPAT V JAYAMU

BY VENKAYYA



EDITED FOR THE FIRST TIME

BY

GUSTAV OPPERT, PH.D.,
Prof. of Sanskrit and Comparative Philology, Presidency College, Madras,



V. RAMASWAMY SASTRULU & SONS
292, ESPLANADE, MADRAS.
1923.

# PREFACE.

THE poem entitled *Rámarájiyamu*, and known also as *Narapativijayamu*, in honor of the brave Ràmarája, contains a genealogy of the Narapati princes who ultimately swayed the destinies of the Kingdom of Vijayanagar. The Ràmaràjìyamu was composed at the beginning of the second half of the 16th century by Súrayya's son Venkayya, the court-poet of Kòdandaràmaràja. This prince, better known as Rámaràja, and son-in-law of the famous king Krishnaràja, was like his father-in-law, a great patron of Telugu literature. I have elsewhere shown that there existed two Krishnaràjas who had as their sons-in-law princes of the name of Ràmaràja.[1]

The Ràmaràjíyamu was written previously to the battle of Tàlikóta, in which Kódandaràmaràja was defeated and killed by the united armies of the Muhammedan Chiefs of Bijapur, Golkonda, Ahmadabad and Bedar.[2]

The narrative is continued nearly up to the period of this catastrophe, and leaves Ràmaràja in the plenitude of his power occupying his throne with his sons round him.

As is usual with work of this kind, the book traces the descent of the Naraptis from Nàràyana through Chandra, the Moon, to the Bharatas, hence to Nanda and from him to the Chàlukyas and through Vijala of Kalyàna to Kódandaràmaràja, the hero of the poem.

The descent is traced as follows:—From Nàràyana, Brahman, Atri, Chandra, Budha, Purúravas, Ayu, Nahusa,

1 See my *Contributions to the History of Southern India*, Part I, p. 43.

2 See Wilson's *Descriptive Catalogue of the Mackenzie Collection*, Second Edition, Madras, 1882, p. 268,

# Genealogical Table of the Narapatis from Bukkaraja.



Yayàti, Puru, &c., descended the Bharatas, and the 83rd in descent from Arjuna was Nanda; his 9th descendant was Chàlukya, and from him was descended Vijala or Bijjala of Kalyàna. His grandson was Víra Hemmaliràya; Hemmaliràya's son was Tàtapinna. Tàtapinna was succeeded by Sómadèva, Ràghavadèva, Pinnasauri and Bukkaràja. This Bukkaräja had two sons Singarâja and Ràmaràja the latter of whom was the father of Timmarája, Kondaràja and Srírangaràja. The sons of the last-named prince were Kònaràja, Timmarája, Ràmaràja or Aliràmaràja, son-in law of Krishnaràja, Tirumalarája, Venkataraja or Venkatàdriràja. Of these, the fourth son, Tirumalaràja, had four sons: Raghunàtharâja, Sriranga-ràja, Ràmaràja and Venkataràja. The third of these, Rama-ràja was the father of Tirumalaràja and Srìrangachikka-räja, the son of the last being Ràmadévaràja. The fifth son of Srírangaràja, Venkataràja, had two sons Ràmaràja and Rangaparàja or Srìrangarâja, the latter of whom had in his turn two sons Venkatàdriràja and Gôpàlaràja. Rámaràja, the third son of Srírangaràja and the son-in-law of Krishnaràja, had also five sons: Krishnaràja, Pedda-timmaràja, Kondarája, Chinnatimmaràja and Sríraṅgaràja of whom Kondaràja had a son named Ràmaràja, and Srìrangaràja had two sons Peddavenkataraja and Chinna-venkataràja, the sons of the latter being Tirumalaràja, Venkataràja and Srírangaràja. Venkataràja had three sons named Kôdandaràmaràja or briefty Rämaràja, Timmarája and Venkatàdrirája, the eldest of whom Kôdandaràmaràja became the son-in-law of the famous Krishnaràja of Vijaya-nagar. This Kódandaràmaràja, who appropriated the regal power had four sons: Peddavenkataràja, Chinna-venkataràja, Kòdandaràmaràja and Venkataràja, and Timmaräja the younger brother of Kódandarämaräja had two sons: Sríraṅgaräja and Chinnavenkataräja. Thi

Kòdandarämaräja the son-in-law of king Krishnaräja, fell, as has already been mentioned previously, in the battle of Tälikòta, but Venkayya closes his Rämaràjíyamu previously to this event

The annals of the Narapati family contain thus many important and interesting accounts concerning the Telugu country, to some of which I have alluded in previous publications of mine.

The poem is written in classical Telugu, in a choice and superior style. It abounds, as is usual in works of this kind, in Alankäras and other rhetorical figures so highly esteemed by the people of this country.

The book is compiled from two MSS. in the Government Oriental MSS. Library, and I am greatly indebted to the learned Pandit M.R.Ry., Kokkonda Venkataratnam Pantulu Gäru for the valuable assistance he rendered me in the publication of it, and also to M.R Ry., D. Rägha-vayya Pantulu Gäru, who kindly helped me in revising the proofsheets.

GUSTAV OPPERT.

MADRAS,
*30th January, 1893.*



శ్రీ

# రామరాజీయము.

---



శ్రీరామామణినిస్తుల స్తనయుగశ్రీగంధపంకాంకవి
స్తారోరస్స్థలుఁ డార్తరక్షణచమత్కారప్రచారుండు స
త్కారుణ్యాంబుధి యారమాపతి కృతార్థత్వప్రభావంబు చే
కూరం జేయుచుఁ బ్రోచుఁ గాతఁ గృపచేఁ గోదండరామాధిపున్. 1

మ. వనజాక్షీసుమబాణు రామమహిభృద్వజ్రుం గృపాదృష్టిచే
ననిశంబుం దగఁ బ్రోచుఁ గావుత విరూపాక్షుండు పుత్రాంగనా
జనగంధేభతురంగవీరభటభూషాద్యమాణిక్యకాం
చనవస్త్రాదిసమస్తసంపదల నిత్యోదయంబు వర్ధిల్లఁగన్. 2

ఉ. ముద్దియ సంతరించు నలుమోముల వేలుపుఁ బెద్ద పద్మపూ
గద్దియమీఁద నుండి త్రిజగంబుల వేడ్కఁ సృజించు జాణ యే
ప్రొద్దును నాగమంబుల నిరూఢిగఁ దాల్చిన లోకనేత బ
ల్పెద్దల ప్రోడ రామవిభుఁ బ్రోచుఁ జిరాయువు చేతుఁ గాఁ గృపన్. 3

ఉ. మున్ను గణేశుఁ డుండ దటు ముద్దులు సొక్క నటించుచున్న మా
యన్న దె వచ్చె నంచు నలినానన పార్వతి పిల్వఁ బోయి తాఁ
జన్నని పల్కి కౌఁగిలిడు సామజవక్త్రుఁడు కోరుకోరికల్
చెన్నలరంగ రామనృపశేఖరుకీవుత సత్కృపామతిన్. 4

ఉ. భూవినుతాత్మనిశ్చలతఁ బొల్చు ముదంబు మదిం దలిర్పఁగా
భావజుఁ గన్నతల్లి మురభంజను పట్టపుదేవి యస్రమం
తీవరు ముద్దుపట్టి రజనీపతికూరిమి చెల్లెలైన ల
క్ష్మీవనజాక్షి రామవిభు గేహమున న్విహరించుఁ గావుతన్. 5

ఉ. మది మదనాంతకుం ద్రిపురమర్దను నిల్పి తపంబొనర్చి యా
సదయుని చెట్టఁబట్టి మయిసామున నిల్చి జగంబులెల్ల స
మ్మదమున నేలు సర్వగుణమండన గౌరి దయామతి న్విభా
స్వదురుగఁ జేయుఁగాత రిపుఖంజను నార్వీటిరామభూవిభున్. 6

తే. కమ్రహర్మ్యాగ్రపద్మవనవాటిఁ గలయ మెలఁగు, సైకతశ్రోణి వారిజజాతురాణి
వాణి ఘనవేణి రామభూవల్లభాస్య, తాను నెప్పుడు వాక్ప్రభవాఖ్యఁ జేయు. 7

క. ఈకృతి నఖిలభువనా,ధారులునైనట్టి దేవతాపరులలస
త్ప్రాకారణ్యాలబ్ధసంపద, నాయధిక రామనృపతి యలరుచు వేడ్కన్. 8

తే. ఒక్కనాఁడంబురుహబాంధవోదయమున, స్నానసంధ్యాద్యనుష్ఠానదానవిధుల
నిష్ఠఁ గావించి హరిపదనీరజముల, నిచ్చ నిశ్చలభక్తిచే నిరవుకొల్పి. 9

సీ. కస్తూరికాగురుకాశ్మీరమిళితమౌగంధంబు మై నిండఁ గలయనలఁది
జాజులు మల్లెలు జతఁగూర్చినట్టి సంపఁగిపూవుకొత్తులు సిగను జుట్టి
దిక్కులఁ గాంతిచేఁ దేజరిల్లఁగఁ జేయు రమణీయమణిభూషణములఁ దాల్చి
బంగారుజిలుగుదుప్పటిహొయల్జిగిబిగి నీటు మీఱఁగ వల్లెవాటు వేసి
తే. వలవసంతజయంతుల గెలువఁజాలు, రూపమున సతులున్మదచాపబాణ
ఖిన్నహృదయాబ్జలగుచు విభ్రాంతిఁ దనర, వసుమతీనాథ నేత్రోత్సవంబుగాఁగ.

సీ. రాజవంశాంబుధిరాకాసుధాకర రాజాధిరాజ వీరప్రతాప
కాపు హన్నిబ్బరగండ సన్నుత మహారాజ చాళుక్యనారాయణాంక
హత్తుమున్నూరగండ హత్తుహన్నిబ్బరగండ రాయబరగండ చండశౌర్య
యరిరాయమర్దన ధరణీవరాహ గండరగండ యని భట్లు సరసమధుర
తే. వాగ్విజృంభణ మీఱఁ గైవారములను, జేయ నిరువంకలను సతుల్సేరి మెలఁగ
భూసురాశీర్వనాదము ల్బోరుకలఁగ, శంఖభేరీమృదంగనిస్వనము సెలఁగ. 11

సీ. భూరిబాహాబలస్ఫూర్తిచేత మహాప్రచండులౌ జెట్లు కైదండలిడఁగఁ
జెలఁగుచు సదుపజీవులు చెంత నిర్మలముక్తామణిచ్ఛత్రముల ధరింప
నంతంతఁ గదిసి సామాన్వయాధీశ్వరులడపంబుఁ గత్తిఁ బావడలఁబట్ట
వలనొప్పఁగఁ దదాప్తులు గిండిఁ గాళాంజిఁ బాదుకల్సురటిదర్పణముఁ బూన
తే. నమ్రులగుచున్న ధారుణీనాథవరుల, సంద డిరువంకఁ బాయ నందంద వేత్ర
ధరులు సాహోని నాడులై తఱుచు మెలఁగ, నగరు వెలువడి మొగసాల నడచివచ్చి.

సీ. ప్రాకటహేమచిత్రవిచిత్రితంబులై కొమరొందువైదూర్యకుడ్యములను
రమణీయమౌక్తికరంగవల్లికలతో విలసితంబగుహీరవేదికలను
ఘనపద్మరాగసంఘటితోన్నతములునై తనరారువిద్రుమస్తంభములను
వితతపార్శ్వవిభ్రాజత్కృతకరికరముల రూఢించుమరకతారోహణములఁ
తే. గలిగి లక్ష్మీనివాసాఖ్యఁ జెలఁగి చూచు, జనులకెల్లను రోహణాచలవిధంబు
మదినిఁ గదురఁగఁజేయుచు ముదమొనర్పఁ, జాలినట్టిమహాసభాసదనమునను. 13

క. కోరికలీరికలెత్త న, హీరమణులు దెలుపుమనవులెల్లను నెంతేఁ
గారుణ్యమతిని వినుచును, బేరిమి మణిఖచితసింహపీఠస్థుండై. 14

తే. చెలులు బాంధవజనములుఁ జేరి తత్త, దుచితవందనసల్లాపరచనలలర
మన్ననలఁజాలఁగాంచి చేసన్నఁ జూపఁ, నర్హకనకాసనాసీనులై చెలంగ. 15

సీ. కోసలుఁ గెలిచి కైకొన్నయేనుఁగులివె సాళ్వుఁడిచ్చినజవాశ్వంబులివియె
పాండ్యుఁడేఁటేఁటను బనుపుముత్యములివి ద్రవిళుఁడంపినయట్టిద్రవ్యమిదిగొ
చోళుచేఁదెచ్చినసుందరీచయమిది కాళింగుఁడొసఁగినకనకమిదిగొ
మగధునిచేఁగొన్నమండలాగ్రంబిది శూరసేనుండంపుసొమ్ములివిగొ
తే. యనుచు సచివులు దెలుపఁ గైకొనుచు యువతి, వారకరమణికంకణక్వాణకలిత
చామరోద్ధూతపవనసంచలితఫాల, కుంతలుండౌచు రాజసంబంత మెఱసి. 16

చ. నరవరసంఘమౌళిఘననవ్యకిరీటమణిప్రభాలస
చ్చరణసరోజుఁడౌచుఁ గనుసన్ననుపేంద్రునిమాడ్కిఁ దిమ్మభూ
వరమణి కార్యదక్షుఁడయి వర్తిల రామనరేంద్రుఁడెంతయున్
గురుకవిసౌమ్యయుక్తముగఁ గొల్వుననుండె సురేంద్రుకైవడిన్. 17

క. ఈలీల రామధరణీ, పాలుఁడు సకలనృపకమలభాస్కరుఁడై పే
రోలగమున మృదుగానం, బాలించుచుఁ గావ్యసరణులరయుచు వేడ్కన్. 18

క. నగుమొగమున ననుఁ గనుఁగొని, జగతీసురవంశమణివి సత్కవివగుటన్
దగుదువు మామన్ననకుఁ బో, సఁగంగనంపుగుల నూరసచివునివెంగా. 19

క. రారమ్మనుచును మిక్కిలి, గారవమునఁ బిలిచి చెంత గద్దియపైన
న్నారూఢునిఁగా నొనరిచ్చి తోరముగాఁ జేలములను దొడవులనొసఁగెన్. 20

క. ఈవిధమున బహుమానముఁ, గావించి మదీయవంశకర్తలచర్యల్
భూవలయంబున వ్యాసవ,చోవిరచితలీల సర్వశుభకరమగుచున్, 21

క. పంచమవేదం బని బుధు, లెంచం దగి భారతాఖ్య నెసఁగినదానిన్
మించినశక్తిని నాక, ర్ణించనె నామదికి నెప్పుడుఁ బ్రీతి జనించున్. 22

ఆ. తారలెన్నవచ్చు వారిధి నవలీల, దాటవచ్చు గిరుల మీటవచ్చు
భారతార్థ మెఱుఁగి పలుకంగవచ్చునె, చిలువ ఱేనికైన నలువకైన. 23

క. కన్నంత బుధులచేతను, విన్నంతయు నంధ్రభాష వివరింపఁబడెన్
జెన్నలరఁగ భారతమా, నన్నయభట్టాదికవిజనంబులచేతన్. 24

క. ఆవిద్వత్కవులాదిగ, భావలయంబందుఁ గలుగుపూర్వకవీంద్రుల్
మానంశజులగు రాజుల, నేవిధమునఁ జెప్పినారొ యితరకృతులలోన్. 25

క. నీవును సంక్షేపముగా, నావిధమును దెలిసి పేరులాఘవచర్యల్
గావింపుము కృతిరూపము, గా వినవలెననెడువాంఛ గలిగెను మాకున్. 26

తే. అనిన నౌఁగాక యని సంస్కృతాంధ్రకవుల, వినుతులొనరించి తత్పాదవనరుహముల
డెందమున నిల్పి వ్యాసవచోబృందగరిమ, రామరాజీయమనుకృతి రహి రచింతు. 27

వంశావళి.

సీ. నారాయణుని నాభినలినగర్భంబున నాలుగుమొగములనలువ వొడమె
నాభారతీశునోహరుపదాంగుష్ఠంబువలన దక్షుం బౌరువులను గలహ
భోజనుండును నాభిఁ బులహుండు కర్ణములను బులస్త్యుండు త్వక్కునను భృగువు
కరములవలనను గ్రతువు ముఖంబుల నంగిరసుఁడు ఘ్రాణమందు నల వ
తే. సిష్ఠుఁడును మనమున మరీచియును నేత్రములనత్రియును నఁగను గలిగి రెలమిఁ
బదుగురు తనూజు లురుబాహుబలులు భవవి, దూరులనలార్కతేజులు వారిలోన.

చ. జగదభినంద్యపాదజలజాతుఁ డమేయుఁ డజేయుఁ డాలస
న్నిగమరసాతిలోలకమనీయమనోంబుజుఁ డుగ్రపాపదు
ర్నగబలసూదనుం డలఘుదమ్యతపోధనుఁ డర్కభాస్వరుం
డగణితపుణ్యమూర్తియగు నత్రిమహాముని జెప్పనొప్పదే. 29

క. ఆయత్రికి ననసూయకుఁ, దోయజభవతోయజాక్షధూర్జటులతుల
శ్రీయుతులై జనియించిరి, తోయజవిద్వేషిదత్తదుర్వాసులనన్. 30

ఉ. వారలలోన నొప్పె ననవద్యగుణాకరుఁ డాశ్రితాంబుదో
దారుఁడు దారితప్రకటతామసచక్రుఁడు చక్రవాకని
స్సారకరుండు సారకరజాతరుచిస్ఫుటనవ్యమోదక
ల్హారసరోవరుండు వరభాహ్యాతచంద్రుఁడు చంద్రుఁడున్నతిన్. 31

క. అతనికి రోహిణికి గుణా, న్వితుఁడగుబుధుఁడుదయమయ్యె నీరేజారి
హితపరిసరవర్తనచే, క్షితితలజనతతికి మిగుల క్షేమకరుండై. 32

క. ఆరౌహిణేయునకిళాం, భోరుహనేత్రకును సతతబుధనుతశౌర్యో
దారుండు సరససుగుణా, ధారుండు పురూరవుండు దగ జనియించెన్. 33

సీ. అసహాయశూరతనవనిలోన క్షాత్త్రజగణములనెల్లను గడఁకనణఁచి
వితతత్రయోదశద్వీపంబులెల్లను బాహుబలస్ఫూర్తిఁ బరఁగనేలి
కరమర్థిఁ గ్రతువుల సురలఁ దన్పుచుఁ బ్రజలభ్యుదయంబుల నలరుచుండ
ధర్మస్థితినిఁ బ్రోచి ధనదుతో నెనయగుసంపదలను జాల సొంపుమిగిలి
తే. గరుడగంధర్వకిన్నరవరులతోడ, నెయ్యమొనరించి మెలఁగుచు నిర్జరేశు
మన్ననలఁ గాంచెఁ దత్సభాసన్నవిబుధ, చయము వొగడఁ బురూరవశ్చక్రవర్తి.

తే. ఆపురూరవుఁడూర్వశియందుఁ బ్రేమ, దనరనాయువు ధీమంతుఁడును వసువు దృ
ఢాయువుఁ జిరాయువు శతాయువనఁగ వరుసఁ, గనియె నార్వురు గొడుకుల వినుతయశుల.

క. ఆయవనీశులలోపల, నాయువు ధరనీతిబాధలందకయుండన్
న్యాయముగ నేలె శాత్రవ, నాయకవరసేవితాంఘ్రినలినుం డగుచున్. 36

సీ. అమరేంద్రుఁడాదిగా నమర సంఘమువచ్చి తమహావిర్భాగసంతతులఁ గొనఁగ
నవరత్నమయభూషణముల గోచయముల భూసురప్రతతికి భూరియొసఁగి
రాజసూయంబులు వాజపేయంబులు మొదలుగాఁగల మఖములనొనర్చి
రాకేందుకీర్తిసురభిదామముల దిగంగనలకు శృంగారమును ఘటించి
తే. యాయువును గాంచె స్వర్భానుయందు నహుషు
క్షత్రవృద్ధు ననేనసుఁ గరభు రజి సు
యశుల బాలార్కతేజుల నలఘుమతుల
వరకుమారుల నేవుర వారిలోన. 37

మ. మఖముల్పెక్కులొనర్చి దేవతల సన్మానంబుఁ గావింపుచున్
లఘుమార్గేతరుఁడై కుభృత్తతికి నశ్లాఘ్యత్వ మొందించి ని
త్యఘనోదారత భూజనంబులకు నత్యంతప్రమోదంబుగా
నఘదూరంబుగ ధాత్రి నేలె నహుషుండాఖండలుండో యనన్. 38

తే. ఆనహుషునకుఁ బ్రియవాసయనెడి ముద్ది
యకు యయాతి సంయాతి ప్రయాతి యన సు

తులు జనించిరి వారిలోపల యయాతి
చిరయశోహారి రాజ్యాభిషిక్తుఁ డయ్యె. 39

సీ. పాకారి దోడాసపడ దేవదైత్యసంగరమునఁ బెక్కురక్కసులఁ దునిమి
హయమేధరాజసూయాతిరాత్రాదియాగంబుల సురలయాఁకలినడంచి
తనకనియమునుపేక క్షితిఁగలయట్టియర్థము బ్రాహ్మణులకు దానముగ నొసఁగి
వర్ణాశ్రమంబుల వరుసనడపుచు జలనిధిమేఖలను నలంకరించి
తే. సకలపురరాజ మాప్రతిష్ఠానపురము, దనకు వరరాజధానిగాఁగను యయాతి
ధర్మమెంతయు నాల్గుపాదముల నడచి, పెంపు సొంపు వహింపంగఁ బృథ్వినేలె.

క. కవివృషపర్వతనూజుల, సవినయలను దేవయానశర్మిష్ఠల భా
ర్గవునను మతి ననురక్తినిఁ, బ్రవిమలమతి యాయయాతి పరిణయమయ్యెన్. 41
తే. ఆసతులయందు సకలసౌఖ్యావహుండు, నగుచు యదుతుర్వసుల దేవయానవలన
ననఘ శర్మిష్ఠయందు ద్రుహ్యానుపూరు, లనఁగ సుతులను నేవురఁ గనె యయాతి.
క. వారలలోపల నెంతయుఁ, బూరుఁడు సదసద్వివేకభూషణుఁ డరిసం
హారుఁడు హాటకభూధర, ధీరుఁడు నయమార్గవిజితధిషణుం డొప్పెన్. 43

సీ. జనకుండు వేఁడ యౌవనమొసఁగి తదనుమతిని రాజ్యాభిషిక్తత వహించి
సకలధాత్రీశ్వర మకుటాగ్రరత్నరుగ్భాసితపాదసరోజుఁడగుచుఁ
దనపంపుఁబూర్వజు లొనరింప నయముచే నాలుగుచెఱఁగుల నేలనేలి
హరి మెచ్చ బహుదక్షిణాన్వితముగ శతక్రతువుల సురలకామెతలొనర్చి
తే. క్షితినిఁ గలిదోషమేమియుఁ జెందకుండ, నరసి రక్షించి ప్రజలకాహ్లాదమొసఁగి
పరమధర్మజ్ఞుఁడనుచు దిక్పాలసభల, గణనకెక్కుచుఁ బూరుభూకాంతుఁ డలరు.

క. ఆపూరునకును గౌస, ల్యాపంకజవదనకుదయ మయ్యెను గరుణా
కూపారుఁడు జనమేజయ, భూపాలుఁడు రాజవంశభూషణుఁ డగుచున్. 45

సీ. అదనుదప్పకయుండ నరసి నీరదములు నింపుసొంపుగను వర్షింపుచుండ
వేళ్లను గొలుచని వినుతిసేయఁగఁ దగి సకలసస్యములు దున్నకయె పండ
ముదముతో ధేనుసమూహముల్ముప్పొద్దులందును జేపి చన్నవిసి పిదుక
వ్యాకులత్వములేక ప్రాకటసంతోషకరితులై నూఱేండ్లు ప్రజలు మనఁగ
తే. నఖిలధర్మంబు లభ్యుదయాభివృద్ధిఁ, దనరఁగను జనమేజయమనుజభర్త
రాజ్యమేలుచుఁ బెక్కధ్వరంబు లొనరఁ, జేసి విప్రులనెల్ల దక్షిణలఁ దనిపె.

క. ఆజనమేజయనరపతి, రాజాస్యయనంతవలనఁ బ్రాచీశమహా
రాజేంద్రుఁ గాంతివైభవ, రాజేంద్రుం గనియె విబుధరాజి నుతింపన్. 47

సీ. చండవిక్రమమున సాధించి నిష్కంటకంబుగాఁ బూర్వదిగ్భాగ మెల్లఁ
బ్రాభవంబున నేలి ప్రాచీశనామంబుఁ దనకు నెంతయును సార్థముగఁ జేసి
మనుమార్గవర్తియై యనుదినంబును సర్వజనపతుల్గనుసన్నఁ బనులొనర్ప
భూరిదక్షిణలిచ్చి పురుషోత్తముని రమాకాంతునిఁ గూర్చి యాగములొనర్ప
తే. జారచోరులబాధలు మారిభయము, దొలఁగ ధనధాన్యవృద్ధియుఁ గలితపుణ్య
ధర్మతత్పరవృత్తియుఁ దనరఁ బ్రజలు, వినుతిసేయంగఁ బ్రాచీశవిభుఁడు వెలఁగె.

క. ఆప్రాచీశాత్మకులకు, భూప్రణుతయశోధనుండు పొడమెను సంఖ్యా
తిప్రభువృషభుం డప్రతి, మప్రకటపరాక్రమద్యుమణియో యనఁగన్. 49

శా. ఏలెన్వార్ధిపరీతభూమివలయం బేకాతపత్రంబుగాఁ
దోలెన్విద్విషులద్రిగహ్వరములందున్భీతిచే డాఁగఁగాఁ
జాలెన్సంతతయాగకృత్యములనస్వప్నావళిం బ్రోవఁగాఁ
బోలెంబూర్వనరేంద్రకోటికెనగాఁ బోల్పంగ సంఖ్యాతిగాన్. 50

క. శీతకరవంశవర్ధనుఁ, డాతతధర్మస్వరూపుఁ డనఁదగు నాసం
ఖ్యాతికి వరాంగికిని నహు, యాతిమహీపాలకామ్యతాంశుఁడు వుట్టెన్. 51

సీ. అసదృశబాహుగర్వాతిరేకోన్నతి ఖండనభూమినిఁ బగఱనడఁచి
హితమతితోఁ బ్రీతినెదురేగుదెంచిననృపకులాధీశులఁ గృపను మనిచి
నిరుపమనయవృత్తి నిష్కంటకంబుగా ధరణీతలంబును స్థిరత నేలి
యరయిక గడుఁ గల్గియనురక్తజనులను సంపన్నులై యుండ సంతరించి
తే. యశ్వమేధాదిమఖములనమరపతికిఁ, బ్రమదమొనరించి కాంచె భానుమతియందుఁ
బ్రీతిదళుకొత్తఁగను నహుయాతిభూతలాధిపేంద్రుండు సార్వభౌమాఖ్యసుతుని.

ఉ. చండవిరోధివీరనృపసంఘముఁ ద్రుంచి తదీయమత్తవే
దండతురంగరత్నధనధాన్యముఖాఖిలవస్తుసంతతుల్
మెండుగ సార్వభౌమనృపమిత్త్రుఁడు గైకొని నిత్యవైభవా
ఖండలుఁడై ప్రజల్గడు సుఖస్థితినుండఁగ నేలె రాజ్యమున్. 53

మ. యమునాదేవధునీతటంబుల సరోజాక్షున్ హరింగూర్చి యా
గములున్నూఱు సుదక్షిణాన్వితముగాఁ గావించి యాసార్వభౌ

మమహీశుండు సునంద నాఁగఁదగుభామారత్నమందుం బ్రమో
దము దళ్కొత్తఁగఁగాంచె దండితరిపూత్సాహుఁ జయత్సేనునిన్. 54

శా. నానాభూపతులెల్ల నిక్కపటులై నానాఁటనుం బ్రేమపెం
పూనన్వైరములేక కొల్వ రతిచేనొప్పారుచెంతే జనుల్
దానోత్సాహముచేఁజెలంగ మిగులన్ ధర్మంబుతోడం జయ
త్సేనుండేలె ధరిత్రి యాగములచే జేజేలఁబోషింపుచున్. 55

తే. ఆజయత్సేనుఁడును విదర్భావనీత, లాధిపేంద్రునిప్రియపుత్త్రియౌసుభద్ర
యనుపయోరుహపత్త్రాయతాక్షివలనఁ, గనియెఁ బ్రీతి సురాచీనమనుజవిభుని. 56

ఉ. మానవనాథులెల్లనని మార్కొని యోడి సమస్తవస్తువు
ల్గానికలిచ్చి కొల్వ నవఖండవసుంధర నేలుచు న్సురా
చీనుఁడు భానుజాదివిజసింధుతటంబుల నూఱుయజ్ఞముల్
మానితనిష్ఠఁజేసెఁ బలుమాఱు నిలింపులకింపుసొంపుగన్. 57

క. ఇననిభుఁడైనసురాచీ, నునకు విదేహక్షితిపతనూజారత్నం
బనఁదగుమర్యాదాబ్జన, యనను మహాభౌమనరవరాగ్రణి పుట్టెన్. 58

మ. బలవద్వైరులఁ ద్రుంచి శత్రునను శబ్దంబేమి లేకుండ దో
ర్బలగర్వోన్నతిచేనొనర్చుచు మహాభౌమావనీనాయకుం
డిలనేలెం బ్రజలెప్పుడున్సుఖముచేనెంతే మనంగీర్తి ది
క్కుల రాజిల్లఁగఁజేసె జన్నములు పెక్కుల్దేవతల్మెచ్చఁగన్. 59

తే. ఆమహాభౌమసర్వంసహాతలాధి, పాధ్యునకును బ్రసేనజయౌసుపుష్ట
యనుసుధాకరబింబాస్యకునుజనించె, ఘనుఁడునయుతానియుతుఁడనుమనుజవిభుఁడు.

క. భయభక్తి నఖిలభూవర, చయమనిశముగొలువ రాజసంక్రందనుఁడై
నయమున ధరఁబాలింపుచు, నయుతానియుతుండు చేసె నానాధ్వరముల్. 61

క. మానితచరితుండగునయు, తానియుతునకుఁ బృథువాసతనయామణియౌ
భానుమతికి నక్రోధన, భూనాథుండుదయమయ్యె బుధమతులెసఁగన్. 62

క. బంటుతనంబున నాము, క్కంటగునక్రోధనుండు కదనస్థలిలోఁ
గంటకులఁదునిమి ధర ని,ష్కంటకముగ నేలి చేసెఁ గ్రతుశతమెలమిన్. 63

క. ధీనిధియక్రోధనభూ, జాని జగద్విదితపుణ్యచరితౌకాళిం
దైనకరందనయందును, మానుగ దేవాపియనుకుమారునిఁగాంచెన్. 64

సీ. కడిమి దిగ్విజయంబుఁ గావించుచో నిషధతురుష్కశకయుగంధరయవనులు
రథికతురంగవారణపదాతులతోడ నెదిరింపనందఱు మదములడఁచి
యెదురెందులేక తుహినమహీధరసేతుమధ్యోర్విఁ గలసర్వమనుజపతులు
నిటలతటాగ్రసంఘటితకరపుటులై చేరి నమస్కృతుల్సేయుచుండ
తే. రాజ్యమంతయుఁ దానేలి ప్రజల నీతి, మార్గమునఁ బ్రోచి దేవాపిమనుజవిభుఁడు
రాజసూయాశ్వమేధాధ్వరములొనర్చి, మణులుదక్షిణలుగను బ్రాహ్మణులకొసఁగె.

క. ఆదేవాపి విదేహ,క్ష్మాదయితునితనయయైనమర్యాదాశా
తోదరియందును గాంచెను, మోదంబున రుచికుఁడనెడుముద్దుకుమారున్. 66

క. రుచికమహానరవరహిమ, రుచి సాధువిరోధినరుల రూపడఁచి నయ
ప్రచురతను నిఖిలభూవర, నిచయము సేవింప ధారుణీతలమేలెన్. 67

క. నిజభుజదర్పముచే ది,గ్విజయార్జితమైనధనము విప్రులకిడి పం
కజనాభుఁగూర్చి రుచికమ,నుజనాథుఁడు యాగములను నూఱునొనర్చెన్. 68

తే. ఆరుచికునకును వరాంగియైనదేవి, యనువధూటీమణికి ఋక్షుఁడనఁగఁబరఁగు
నందనుఁడు పుట్టెనతఁడెదురెందులేని, కడిమి పెంపున బుడమినొక్కరుఁడెయేలె.

చ. సరసిజగర్భసూతియనిశంబును శుద్ధశ స్రుక్కఁ దానజా
తరిపుఁడునాఁ బ్రజన్గడుముదంబలరారఁగఁ బ్రోచి ధర్మత
త్పరతఁ జరించి యజ్ఞములఁ దామరసోదరుఁగూర్చి చేసి భూ
సురులకొసంగె ఋక్షనృపసోముఁడు శుద్ధసువర్ణరాసులన్. 70

క. ఆఋక్షేశుఁడు తక్షకు, కూరిమిసుతయైనజ్వలను గులపాలికగాఁ
గోరి వరియించి తద్రా, మారత్నంబందుఁ గాంచె మతివరనృపతిన్. 71

ఉ. మండితఘోరవీరరణమండలిఁ గిట్టి విపక్షధారుణీ
మండలనాథకోటిఁ బరిమార్చి పరాక్రమరేఖ నెన్న రు
ద్రుండనఁ బోలునామతివరుండిలనొక్కరుఁడేలి వైభవా
ఖండలుఁడై ప్రజన్మనిచె గౌరవమొప్ప దయార్ద్రబుద్ధితోన్. 72

క. మతివరుఁడు చేసెఁ గ్రతువుల, శతములనొకటొకటికొసఁగె జాంబూనదని
ర్మితరథకరిహయముల వి, ప్రతతికి దక్షిణలుగాఁగఁ బరమప్రీతిన్. 73

క. మతివరనృపతి జగద్వం, దిత సుచరితయాసరస్వతీనదియందున్
హితమతిఁ గాంచెను ద్రసు భూ, పతినినతం డేలె వసుధఁ బరహితమలరన్. 74

చ. వినయముతో సమస్తపృథివీరమణుల్ వ్రతతంబు నేర్పుమైఁ
బనులొనరింప ధర్మపరిపాలనకాత్మ జనుల్సెలంగ స
జ్జనసుతుఁడై త్రసుండు సురసంఘములెల్లను వచ్చి వేడ్కతోఁ
గనుఁగొని సన్నుతింపఁగ మఘంబులు నూఱునుజేసెఁబల్మఱున్. 75

తే. ఆ త్రసుండును గాళిందియాకరంద, యనఁగఁబరఁగుమదేభేంద్రయానఁగాంచి
రధికసంతోషభరితాత్ములగుచు నీలుఁ, డనుకుమారు మహోదారు నఘవిదూరు. 76

మ. సకలక్షోణితలంబు నేకధవళచ్ఛత్రంబుగా ధర్మమున్
బ్రకటంబౌచును నాల్గుపాదములనున్ రాణించి వర్తింప రా
జకులోత్తంసులుగొల్వ నీలుఁడును రాజ్యంబేలె గీర్వాణయా
చకభూదేవుల యాగదక్షిణలచే సంతుష్టినొందింపుచున్. 77

క. కాంతాజనమణియైనర, థంతరకును నీలభూతధాత్రీపతిక
త్యంతగుణాన్వితుఁడగుదు, ష్యంతుఁడు జన్మించె సకలజనసన్నుతుఁడై. 78

క. ఆదుష్యంతుఁడు సకలమ, హీదయితులుగొలువ రాజ్యమేలుచునెంతే
మేదినికనురాగము సం, పాదించె సమస్తవర్ణపరిపాలకుఁడై. 79

క. శరనిధిపరీతవిశ్వం, భరయందలిప్రజలు హర్షభరితులగుచు మా
కరయఁదలిదండ్రి దుష్యం, తరసావల్లభుఁడె యనఁగ దయతోఁ బ్రోచెన్. 80

క. అరులంబోరిగొని తెచ్చిన, సిరులన్భూసురులకొసఁగి చేసెను నానా
ధ్వరముల దుష్యంతుఁడు నిర్జరులనిశము పారణనుచు సంతోషింపన్. 81

క. తేజోనిధి దుష్యంతో, ర్వీజాని శకుంతలను వరించి కనియెఁ ద
ద్రాజనిభాననవలనన్, క్ష్మాజనజేగీయమానచరితు న్భరతున్. 82

సీ. శైశవంబందును శరభాదిసత్వసంఘములను దమియించి కణ్వమౌని
గనుఁగొని సర్వదమనుఁడవుగమ్మని పేరిడి ప్రేమచేఁబెనుపఁ బెరిగి
కడిమిచే శత్రులగర్వంబు వారించి సింహాసనస్థుఁడై చెలఁగి ప్రజలు
సంతతాభ్యుదయంబులెంతేనిఁదనరఁబెన్నేలదాఁనొక్కరుఁడేలుచుండి

తే. తిగ్మకిరజాసరస్వతీదేవతాత, రంగిణీతీరములననురక్తిఁబెక్కు
రాజసూయాశ్వమేధాధ్వరములఁజేసి, బ్రాహ్మణుల దక్షిణలఁదన్పె భరతవిభుఁడు.

క. శ్రీ మించఁగ భరతమహా, భూమీశుఁడు కేకయేంద్రపుత్రి సునందా
భామను వరించె వారికి, భూమన్యుండుదితమయ్యె బుధజననుతుఁడై. 84

శా. క్రోధోద్రేకదయాభరంబున రిపుక్షోణీతలాధీశులన్
రూపుల్మాపుచు భూజనంబులకు నాయూష్షోన్నతిన్నిమ్మదం
బాపాదింపుచుఁ గీర్తియే ధనముగా నార్జించి భూమన్యుధా
త్రీపాలుండిలయేలెఁ దాఁ దుహినభూభృత్సేతుపర్యంతమున్. 85

క. భూమన్యుఁడు దాశార్హ్వమ, హామనుజపతిసుత విజయయనుసతివలనన్
బ్రేమఁగనియెఁ బూర్వధరి, త్రీమండలనాథనిభచరిత్రు సుహోత్రున్. 86

సీ. చతురబ్ధివేష్టితక్ష్మాచక్రమేలుచు సద్భక్తి విప్రపూజల నొనర్చి
ప్రతిదినంబునుజేయు వ్రతముల ముదితుఁడై పర్జన్యుఁ డేఁ డేఁటఁబసిఁడిఁగురియ
నయ్యర్థమునను శాలాదిసాధనములఁ గాంచననుయములుగాఁగఁజేసి
ధాత్రీశ్వరోచితాధ్వరముల నేకము ల్గావించి సురల వేడ్కలనుదేల్చి

తే. క్రతువుక్రతువుకుఁ గనకంబు రాశిఁబోసి, భూరిదక్షిణగాఁగను భూసురులకు
వలసినట్టుగఁ గొనిపోవ సెలవుఁబెట్టి, వినుతికెక్కె సుహోత్రపృథ్వీవరుండు. 87

క. రాకేందుబింబముఖిని, క్ష్వాకుప్రియపుత్రియౌ సువర్ణను సతిఁగాఁ
జేకొని ప్రేమ సుహోత్రుం, డాకామినివలనఁ గాంచె హస్తికునాఖ్యున్. 88

సీ తనవంశజులకును దనకును వరరాజధానిగాఁ దనపేరఁ దనరఁ బురముఁ
గావించి నిష్కంటకంబుగ నుదయాస్తగిరులు మేరగఁగలధరణియఖ్ఖ
రవరమునకుఁజెల్లి రాఁజేసియేలుచు నయమార్గమున భూజనములఁబ్రోచి
భాగీరథీతీరభాగంబునం దశ్వమేధాదియాగసమితి సుదక్షి

తే. ణాన్వితంబుగనొనరించి యమరతతిని, విప్రులనుబ్రోచి హస్తిపృథ్వీవరుండు
పూతచరిత త్రికర్తేశపుత్రియౌయ, శోదవలన నికుంభాఖ్యపుత్రుఁగనియె. 89

ఉ. ఆలములోన శత్రుల నిజాసిపథంబున మిత్రమత్తనుం
డాలజవాశ్వవీరసుభటప్రకరంబులతోడఁ గాలువె
న్బొప్పిలికిఁబంచి భూప్రజలఁబ్రోచుచునొప్పె నికుంభధారుణీ
పాలుఁ డశేషభూధరణభారవహోజ్జ్వలబాహుదండుఁడై. 90

ఉ. అచ్చుగ నానికుంభవసుధాధిపచంద్రముఁడేలురాజ్యమం
దెచ్చటఁజూచినం బరహితేచ్ఛయు నిర్మలపుణ్యావర్తనం
బొచ్చమొకింతలేనికరుణోజ్జ్వలభావములుల్లసిల్లఁగా
నిచ్చలు భూప్రజల్గనిరనింద్యశుభోచితవైభవంబులన్. 91

తే. జాహ్నవీతీరమునను నిష్ఠాగరిష్ఠ, చిత్తమున నికుంభుండు దక్షిణాసంగి

ధారుణీనాయకోచితాధ్వరములెల్ల, వరుసఁగావించి సురల భూసురులఁదనిపె. 92

క. జంభద్విణ్మిభుఁడైనని, కుంభనృపాగ్రణికి సరసగుణఖని వసుదే
వాంభోజముఖికి శౌర్యవి, జృంభుఁ డజామీఢధారుణీశుఁడు పుట్టెన్. 93

మ. నతులై కాన్కలొసంగి సంతతము భూనాథోత్తముల్గొల్వఁగాఁ
జతురంభోధిపరీతభూమినసదృక్ఛౌర్యుండజామీఢుఁ డం
చితదోర్గర్వమెలర్ప నేలెను బ్రజల్ జేజేయనన్ధర్మమూ
ర్జితమై మిక్కిలి నాల్గుపాదములచేఁ జెన్నొంది వర్తింపఁగన్. 94

క. హెచ్చుగఁ దనకీర్తిమొనన్, దెచ్చినసిరి వెచ్చపెట్టి దితిజారి మదిన్
మెచ్చ నజామీఢుండు వి,యచ్చరులనుదనిపె సత్క్రతాధ్వరుఁడగుచున్. 95

తే. ఆయజామీఢమనుజనాయకునకుదయ, మైరి కౌసల్య శిశు వినాయువనుస
తులవలన నూటయిరువదినలుగురు సుతు, లందు సంవరణుండు రాజయ్యె ధరకు. 96

సీ. అనురక్తులై సర్వమనుజేశ్వరులుగొల్వ ధరణి నేకాతపత్రముగనేలి
దహనసమీరణగ్రహచారదోషసంభవములౌ భయములేపట్ల లేక
పరహితాచరణ భూసురసురారాధనఁ బరమధర్మజ్ఞతఁ బ్రజలు మనఁగ
నమరసరిత్తీరమందు వసిష్ఠుఁడధ్వర్యుఁడుగాఁగ సంవరణుఁడశ్వ
తే. మేధదశకంబు మఱియును మేదినీవ, రోచితాధ్వరములఁజేసి ఖేచరులను
ధరణిసురులను బ్రోచి భాస్కరజయైన, తపతిని వరించి కురుధరాధిపునిఁగనియె. 97

సీ. విద్విషుండను పేరు వినఁబడకుండ ధరాచక్రమేలుచుఁ బ్రజల ధర్మ
మార్గంబుచేఁ బ్రోచి మహనీయనిష్ఠ యజ్ఞాలయార్థంబుదానవని దున్ను
చున్నచో సురలు ప్రసన్నులై నరమిత్తుమనినిందు మృతిఁబొందు ప్రాణికోటి
నాకనివాసంబునందు సుఖంబుండ ననమిండనిననిచ్చ వారు నిలిచి
తే. తమహవిర్భాగముల సంతసమునఁగొని భు, జింపఁగా శతమఖములఁజేసి దక్షి
ణలుగ మణులిచ్చి సకలవిప్రులనుదనిపి, వినుతికెక్కెనుగురుమహీవిభుఁడు మిగుల.

క. అనఘుఁడు కురుభూపతి మగ, ధనరవరుసుత సుబలయనుతామరసనిభా
ననవలనఁగనెఁబరిక్షి, జ్జనపాలు మహాయశోవిశాలు దయాళున్. 99

మ. అనిశంబున్సకలావనీశ్వరులు పాదాక్రాంతులై కొల్వ భూ
జనులత్యంతవిభూతిఁ జెన్నెసఁగ రాజ్యంబేలి సన్మార్గవ
ర్తన రాణించి పరిక్షితుండెపుడు గీర్వాణద్విజవ్రాతము
త్యనురాగంబుదలిర్పఁజేసె హయమేధాదైనయజ్ఞావళిన్,

తే. ఆపరిక్షిన్మహానృపాలామృతాంశు, నకును బహుదానసుత సంయామకు జనించె
భీమసేనుండు ప్రాలేయధామవంశ, భూషణుఁడు బాంధవాశ్రితపోషణుండు. 101

చ. పరనృపతుల్భయాకులతఁబాటి హిమాచలవింధ్యధారుణీ
ధరగుహలన్వసింపఁబ్రమదంబున భూప్రజలొప్పనేలెను
ర్వరఁదగ భీమసేననృపవర్యుఁడు సంతతసర్వమానవే
శ్వరమకుటాగ్రరత్నరుచిజాలవిరాజితపాదపద్ముఁడై. 102

క. లోకేశు హరినిఁగూర్చి య, నేకక్రతువులనొనర్చి యెంతయుఁబుణ్య
శ్లోకుఁడగుభీమసేనధ, రాకాంతుఁడు జాహ్నవీతరంగిణిచెంతన్. 103

క. కువలయవనబాంధవవం, శవనధిశశి భీమసేనజనవరుఁడు సుభ
ద్రవలనఁగనియె సకలవిబు, ధవరసతతనుతయశఃప్రతాపుఁబ్రదీపున్. 104

చ. హితమతితో సమస్తధరణీశులుగొల్వఁబ్రదీపధారుణీ
పతియెదురెందులేనిపటుబాహుబలంబున నేలె రాజ్యమా
తతముగ ధర్మతత్పరతఁ దామరతంపరయై ప్రజల్మహో
న్నతి విలసిల్ల యజ్ఞముల నాకనివాసులఁ దుష్టిఁజేయుచున్. 105

తే. ఆప్రదీపుండు భీమరాజాత్మజను సు, నందను వరించి తత్సతియందు ధర్మ
పరుల దేవాపి శంతను బాహ్లికులను, వరతనూజులఁగాంచెను వారిలోన. 106

క. శంతనుఁడు గర్వితారిక్ష్మా, తాంతుఁడు సింహాసనస్థుఁడై భూజనుల
త్యంతవిభూతినిఁజెలఁగఁగ, నెంతయు నయవృత్తినేలెనిల సకలంబున్. 107

క. సర్వేశుఁగూర్చి ధరఁగల, సర్వధనము ద్విజులకొసఁగి శంతనుఁడును దా
నుర్వీశోచితమఖములఁ, బర్వములొనరించెఁదగ సుపర్వులకెపుడున్. 108

సీ. జనకునాదేశంబుచందంబునను జహ్నుతనయను వరియించి తత్త్రిపథగ
యందు భీష్ముండనునందనుఁగాంచెఁ బదంపడి కడుఁబ్రేమ దాశరాజ
వరతనూభవ సత్యవతినినుద్వాహమై కనియె నాయోజనగంధివలనఁ
దనయులఁజిత్రాంగదవిచిత్రవీర్యులనిరువుర వారిలో నిద్ధచరితుఁ
తే. డావిచిత్రవీర్యుండు రాజయ్యె ధరకు, భీష్మననుమతి సకలపృథ్వీవరేంద్రు
లనిశమునగత్నవిన్యస్తహస్తులగుచు, గొలువఁబ్రజలెల్ల సుఖములనలరుచుండ. 109

క. సరసిజదళనేత్రు రమా, వరుఁ గూర్చి విచిత్రవీర్యవసుధాధిపుఁడ
ధ్వరములు నూఱువొనర్చెను, బరమోత్సవమొంది సురలు ప్రణుతులొనర్పన్ 110

జ. ఆనృపాలుభార్యలంబికాంబాలిక, లనువికచజలజనయనలు వ్యాసు

వరమువలనఁ గనిరి వరుసను ధృతరాష్ట్రి, పాండురాజవరుల భవ్యయశుల. 111

క. వారిరువురలోఁ బాండుఁడు, ధారుణిఁ డౌనర్చె భుజపరాక్రమరేఖన్
మీఱిధరఁ గలుగుసకలము, హేరాజుల నెల్లనన్ను కరిగాపులుగాన్. 112

తే. దానజపహోమదేవసంతర్పణములు, మగఁటిమినినీతిబాధల మట్టుపెట్టి
పేదసాదలవిన్నపంబాదరించి, ప్రజలఁ బాలించె నయమునఁ బాండునృపతి. 113

క. ఎక్కువకడిమిని నాలుగు, దిక్కులఁ గలనృపుల గెలిచి తెచ్చినధనమిం
పెక్కినమది దక్షిణల, మ్మక్కననిడి చేసెఁ బాండుఁడధ్వరశతముల్. 114

తే. రాజకులవర్ధనుఁడు పాండురాజు కుంతి, వలన ధర్మజభీమార్జునులను మాద్రి
యందు నకులుండు సహదేవుఁడనఁగనరుఁ, బరులవరమున సుతులనేవురనుగనియె.

క. వారలలో నర్జునుఁడు ధ, రారమణుల నెల్లఁ బటుపరాక్రమమునఁ దాఁ
బోరులను గెలిచి తద్ధన, పూరాధిగఁ గొని ధనంజయాఖ్య వహించెన్. 116

సీ. అనిమిషాధిపు గెల్చి హవ్యవాహనునకు ఖాండవం బాహుతిగాఁగ నొసఁగి
జగడంబు మదిఁ గోరి చనుదెరఁ బందికై పెనఁగి ముక్కంటికిఁ బ్రియ మొనర్చి
జంభారి ప్రార్థింపఁ జని కాలకేయాదిదితిజులఁ దునిమి దేవతలఁ బ్రోచి
గోగణంబు మరల్చి కుంభజప్రముఖులతలపాగలడుగ నుత్తరకునిచ్చి

తే. చండగాండీవనిర్ముక్తసాయకములఁ, గురుబలం బెల్లఁ జటిమార్చి ధరకు రాజు
గా యుధిష్ఠిరుఁ జేసి వేడ్కలను దేలె, నర్జునుం డర్జునయశోధనార్జనుండు. 117

చ. సవనతురంగరక్షణకుఁ జాలి వసుంధరఁ జుట్టి వచ్చుచో
బవర మొనర్చి భూవరులఁ బల్వుర గెల్చి హయంబుఁ దెచ్చి వై
భవమునఁ దత్క్రతుత్రయముఁ బాండుసుతాగ్రజుఁ జేయఁ జేసి దా
నవరిపుతోడ ఫల్గునుఁ డొనర్చె ననారతసఖ్యము న్దగన్. 118

క. నవధీగరిష్ఠుఁడు సజ్జన, వినుతచరిత్రుఁ డమరనిభుఁడు విజయుఁడు మోదం
బునను సుభద్రవలనఁ గాం, చెను నభిమన్యుని విధనవిజితశతమన్యున్. 119

క. ఆయభిమన్యుఁడు చాపా, ద్యాయుధవిద్యాప్రవీణుఁ డప్రతిహతశౌ
ర్యాయత్తభుజుఁ డార్యజనవి, ధేయుఁడనుచు-జనులు సన్నుతింపఁగఁ దనరెన్. 120

సీ. కృప గురు గురుసుత కృతవర్మ బాహ్లీక కర్ణ సౌబల శల్య కౌరవేంద్ర
భీష్మప్రభృతియోధబృందంబుతోఁ బోరి వరచిత్రదృఢలాఘవములు మెఱయ
శరములఁ బెలుపి జర్ఝరితశరీరులఁ గావించి రథరథ్యకార్ముకముఖ
సాధనంబులఁ ద్రుంచి ఘముకోల్వ్వనకు బృహద్బలుఁడాదిగాఁగ రాజులను బనిచి

తే. ధర్మనందనుమదికి మోదంబు మిగుల, బ్రథనమొనరించి బాహుసంరంభమునను
వాసుదేవార్జునులకైనవచ్చుననుచు, సమరులెన్నంగనభిమన్యుఁడలరె మిగుల. 121

క. గురుతనయునిశరవేదన, హరికరుణనుదొలఁగనుదయమయ్యెఁ బరిక్షి
ద్వరుఁడభిమన్యువునకును, త్తరకును సద్బుధజనప్రతతినుతులెసఁగన్. 122

తే. చక్రధరభక్తిఁ బ్రహ్లాదుసాటియనఁగఁ, దగుపరిక్షిన్నృపాలుఁడు ధరణినేలెఁ
జతురుదధివేష్టితావనిచక్రమందుఁ, గలుగునృపులెల్లఁదనకరిగాపులుగను. 123

సీ. విక్రమంబునను దిగ్విజయంబుఁజేయుచో నుర్వియు ధర్మంబునొక్కరుఁడను
గోవృషాకృతులఁగైకొనియున్నరాజలక్షణశూద్రరూపంబుఁగలి వహించి
వచ్చి వానిసిదన్నఁగ్రచ్చుఱఁగని హేత్రేయఁబూనిన వాఁడు వెఱచి మ్రొక్కి
శరణన్నఁబ్రోచి రసాధర్మదేవతలను మధురోక్తులననునయించి
*తే. ప్రీతిధర్మదేవునకుఁ బరిక్షితుండు, తనకధీనంబులైనట్టివినుతకొంచ
ఘనదయానూనతపములనెడుమూఁడు, పాదములనిచ్చి నాలుగుపాదములను
నడవఁగాఁజేసి వేడుకఁబడమికొసఁగె. 124

సీ. అమరసరిత్తీరమందుఁగృపాచార్యు నాచార్యుఁగాఁగొని హరినిఁగూర్చి
నముచిసూదనుఁడాదినాకసంవాసులు ముదముతో వచ్చి కన్నెదుట నిలిచి
తమతమయజ్ఞభాగములందుకొనుచుండ భూరిదక్షిణలచే భూసురులను
దనుపుచు నశ్వమేధత్రయంబొనరించి మఱియు రాజోచితమఖములెల్ల
తే. జేసి కడుఁబ్రేమనాపరిక్షితుఁడునుత్తె, రునితనూభవయవ్వమాద్రియనువధూటి
యందుఁగాంచెను జనమేజయశ్రుతసేన, భీమసేనోగ్రసేనుల బిరుదుమగల. 125

క. ఆజనపాలురలో జన, మేజయరాజేంద్రుఁ డఖిలమేదినికెల్లన్
రాజై యొనర్చె జనకుని, యోజన్గలినడఁచి ధర్మమున్నతిఁజెందన్. 126

సీ. తక్షకుపయినల్గి చక్షుశ్శ్రిపోధ్వరమునుజేయునింద్రునిఁగనియతండు
శరణుఁజొచ్చుట విని జంభారనెడఁబాపి తక్షుపరా వేల్వనాక్షణమున
నంబరవీధినినాయహి రా నిల్పి యాస్తికుఁడరుదెంచి స్వస్తిపూర్వ
కంబుగా దీవించి క్రతువు మాన్పను మాని హరిఁగూర్చి జనమేజయావనీశుఁ
తే. డనిమిషవ్రాతమరుదెంచియధ్వరోత్స, వంబునన్నాళ్ళు నిలిచి నెయ్యంబుతోన
తమహవిర్భాగములఁగొననమరతటిని, చెంత మూఁడశ్వమేధముల్సేసె వేడ్క. 127

* ఇది పంచపాదితేటగీతి.

క. దినదినమును వైశంపా, యనుచే వ్యాసప్రణీతమాభారతమున్
వనజోదరశివచర్యలు, జనమేజయుఁడాలకించి సర్వముఁదెలియన్. 128

క. వనజాహితకులమణియగు, జనమేజయమనుజవరవృషభుఁడు వపుష్టం
దను శంఖశతానీకుల, ననఘులనిరువురనుగనియె నతిమోదమునన్. 129

తే. ఆకుమారులలో శతానీకనృపతి, యాజ్ఞవల్క్యునిశిష్యుఁడై యతఁడుసెప్ప
సాంగములుగాఁగ వేదముల్సదివి కృపుని, వలన దివ్యాస్త్రశస్త్రలాభంబుఁబడసె.

ఉ. శోక పెనంగుశాత్రవులఖోఁడిమియెల్లనడంచి యాశతా
నీకుఁడు బాహుపీఠి ధరణీభర మెల్ల వహించి సజ్జనా
నీకముఁ బ్రోచి దుష్టజననిగ్రహమున్దగఁజేసి యజ్ఞముల్
ప్రాకటలీలఁజేయుచు సుపర్వులకామోఁతఁజేయునెప్పుడున్. 131

క. ప్రాకటయశుఁడైనశతా, నీకునకు విదేహధారుణీధవసుతకున్
శ్రీకరమూర్తి సహస్రా, నీకుఁడు జన్మించె విబుధనికరమువొగడన్. 132

శా. శ్రీనారాయణభక్తుఁడున్నతజయశ్రీమంతుఁడౌ నాసహ
స్రానీకుండొకరుండెయేలెను మహాసర్వంసహాచక్రమున్
భూనాథోత్తములెల్లఁగొల్వఁబ్రజలున్ భూత్యాయురారోగ్యస
ద్దానోత్సాహులునై సుఖింప మిగులన్ ధర్మంబు వర్ధిల్లఁన్. 133

క. శ్రీకాంతుఁగూర్చి మఖముల, నేకంబులుసేసె విప్రులెల్లఁదనియ న
స్తోకధనమిడి సహస్రా, నీకనృపతి సురతరంగిణీప్రాంతమునన్. 134

సీ. ఆసహస్రానీకుఁ డశ్వమేధజుఁగనె నతఁడుర్విఁబాలించె హితుఁడెకాని
యహితుఁడౌభూపతినరసినలేకుండ లేమి భూజనులందు లేమిఁజెంద
ద్రవ్యసంపన్నత ధనదుతోనెనయయి పరమేశభక్తితత్పరతఁజెలఁగి
క్రతువులఁజేసి దేవతలతృప్తియొనర్చి వరకీర్తి దిక్కులఁబరఁగఁజేసి
తే. యాదినృపచర్య వర్తించి యార్యవరులు, పొగడనవిశనకృష్ణాఖ్యపుత్త్రుఁగాంచె
నాతఁడెదురెందులేనిసాహసముకడిమిఁ, బుడమినేలెను ధర్మవిస్ఫురణ మెఱసి. 135

క. అవిశనకృష్ణధరిత్రీ, ధవుఁడచ్యుతుఁగూర్చి యాగతతులొనరించెన్
దివిజులు పూర్వనృపాలుర, సవనంబులకెనయటంచు సన్నుతిసేయన్. 136

క. ఆయవిశనకృష్ణుత్మా, నాయకునకుఁజక్రుఁడనెడినరపతిగలిగెన్
దీయుతుఁడతఁడిలనేలుచు, న్యాయంబునఁబ్రజలఁబ్రోచి యహితులనడఁచెన్.

క. ఆచక్రనృపతి రెండవ, యాచక్రధరుండు సద్గుణావళినిసటం

చాచక్రవాళపరివృత, భూచక్రజనముంచేతఁ బొగడంబడియెన్. 138

క. ఫణితల్పుఁగూర్చి నిర్మల, మణులంబుజగర్భసంశమణులఁగడు ద
క్షిణలొసఁగుచుఁ జక్రనృపా, గ్రణి చేసె మఖంబులొప్పఁగనియొన్వేడ్కన్.

క. అనసుధేశబిడౌజుఁడు, భూవలయం బాదిరాజపుంగవచరితం
బై వెలయనేలె ధర్మ, ప్రావీణ్యము మెఱసి బాహుబలగర్వమునన్. 140

ఉ. అండజరాజతల్పు నలినాక్షు రమావరుఁగూర్చి యాగముల్
చండవిరోధిరాజమదసామజయూథపు గేంద్రమూర్తిస
త్త్వుండొనరించె దక్షిణల భూసురకోటులఁదన్పి వేడ్కనా
ఖండలముఖ్యనిర్జరనికాయమువొంగ మహావిభూతితోన్. 141

క. వానికిఁ జిత్రరథుండను, భూనాథుండుద్భవించె భూమి నలమున్
దానాకరుఁడేలె ధర్మము, నూనముగా జనులకెల్ల నుత్సవమొదవన్. 142

సీ. ఆచిత్రరథధరాధ్యక్షుండు బహురథుఁడనుతనూభవుఁగాంచె నానృపాల
కావతంసము సంతతాధ్వరయై మహాసుకృతియై పొల్చి వసుమతి దనర
రాజ్యమేలుచు నిందిరాపతిప్రీతిగాఁ గ్రతువులొనర్చుచు వితతకీర్తి
దిక్కులఁబరఁగించి దేవేంద్రసన్నిభుఁడైయొప్పి సృష్టిమదాహ్వయుండు

తే. నైనప్రియనందనునిఁగాంచె నాతఁడుర్వి, పాలనముఁజేసె ధర్మతత్పరత మెఱసి
బాహుబలగర్వమున రిపూత్సాహమడఁచి, చేసెఁగ్రతువులు పెక్కు దక్షిణలొసంగి.

ఉ. మానుగ సృష్టిమత్సుగుణమండనుఁడుంగనె నిర్జితద్విష
త్సేనుని సత్యసంధుని సుషేణునినాతఁడజాతశత్రుఁడై
దానపరుల్గ్రతాధ్వరులుదారులునై జనులెల్లనిల్వనం
భోనిధివేష్టితంబయినభూతలమేలియొనర్చె జన్నముల్. 144

తే. ఆసుషేణుఁడు సునిశ్చధరాధిపేంద్రుఁ, గాంచెనతఁడుర్వి గతకలికల్మషంబు
గాఁగఁబాలించి రిపులను గర్వమడఁచి, మురహరునిఁగూర్చి చేసె నధ్వరశతంబు.

క. ఆసునిభునకు నృచక్షుఁడు, వాసవనిభమూర్తిగలిగి వరధర్మగుణో
ద్భాసియయి బాహుబలమునఁ, దా సర్వధరిత్రి నేలె దళితాహితుఁడై. 146

తే. ఆనృచక్షునృపాలకుఁడాగమోక్త, దక్షిణలొసంగి రాజోచితంబులైన
యాగములఁజేసె హరిఁగూర్చి యమ్మహీశ, తిలకుఁడునుగాంచె రిపుదవానలుని నలుని.

మ. అహితవ్రాతము ఘోరయుద్ధములఁగి భృత్యామాత్యపుత్రాంగనా
సహితంబై చని వింధ్యగహ్వరములన్ సహ్యాచలాగ్రంబులన్

మిహికాహ్వయమునందు డాఁగి ప్రజకల్మిన్నెల్ల ధర్మంబునన్
మహిఁ బాలించె నలుండు రెంపవనుఁ క్ష్మానాయకుండో యనన్. 148

మ. పరమాత్ముం బగుచక్రిఁ గూర్చి నలభూపాలుండు చేసె న్యయా
తిరఘూత్తంసులమాడ్కిఁ బెక్కుమఖముల్దివ్యస్రవంతీస్థలిం
జిరపుణ్యుండు పరిష్ఠవుండు జనియించెం దన్మహీజానికిన్
ధరణీచక్రము నాపరిష్ఠపన్నపాహ్వయుండు దానేలుచున్. 149

ఉ. సర్వతనైరవిపన్నృపఖండనుఁడై వరకీర్తి దిక్కులన్
బర్వఁగ వర్ణధర్మపరిపాలనగల్గి కృతాధ్వరంబులన్
సర్వనిలింపకోటులకు సంతతమున్బ్రియదంబొనర్చుచుం
బూర్వనరేంద్రచర్యకెనఁబోలుచునొప్పెఁ బరిష్ఠవుండిలన్. 150

తే. ఆపరిష్ఠనరనాయకాధిపునకుఁ, గలిగె మేధావియనుమహీకాంతుఁడతఁడు
కడిమిపెంపున నిష్కంటకముగ వసుధ, ధర్మమున నేలి క్రతువులఁ దనిపె సురల.

క. ఆమేధావికి సునయ, క్ష్మామండలపతి జనించె శౌర్యస్ఫురణన్
దా మహి నేలెను శ్రీరఘు, రామునిచందమునఁ బ్రజలు ప్రణుతులొనర్పన్. 152

క. అతనికి నృపంజయుండను, సుతుఁడుగలిగెనాతనుండు క్షోణీతలమం
చితధర్మస్థితి నేలుచుఁ, గ్రతువులనొనరించె దూర్వుఁ గనియెం బ్రీతిన్. 153

సీ. ఆదూర్వుఁడుర్వి నేకాతపత్రంబుగ ధర్మంబుతో నేలి దానవాంత
కునిఁ గూర్చి జన్నంబులొనరించె నప్పుణ్యతమునకు జన్మించె నిమినృపాలుఁ
డతఁడు భూమీశులనాహవంబున గెల్చి వారలు భయభక్తిఁ జేరి కొలువ
వసుధఁ బాలింపుచునసదృశవైభవంబలరనశ్వరములననిమిషులను

తే. దనివినొందించెఁ గనె బృహద్రథునతండు, ధరణికధిపతియై ప్రజనరయికలను
నరసి రక్షించి చేసెను హరినిఁ గూర్చి, యాగశతమునుగనె సుదాసాఖ్యసుతుని.

సీ. ఆసుదాసనరవరాగ్రణి ముదమునఁ గనియె శతానీకమనుజవిభుని
నతఁడు దుర్దమనధరాధీశుఁ గాంచె నమ్మానవేశునకు విహీనకరుఁడు
పుట్టెను దద్రాజపుంగవునకు దండపాణిగల్గెను దండపాణికుదయ
మయ్యెను నిమియమ్మహారాజునకు క్షేముఁడా క్షేమనృపతికి ననఘమూర్తి

తే. యాబృహత్క్షత్రుఁ డాతనియనుఁగుఁదమ్ముఁ
డగుబృహద్రథుఁ డాభూతలాధిపునకుఁ
బొడమెను బురంజయుండనుభూవరుండు
వానికుదయించె శిశునాగవర్ధనుండు. 155

తే. దానికినిబుట్టె శృంగుఁడానసుమతికిఁ, బేర శృంగాఖ్యకులముర్విఁ బెంపుఁగనియెఁ
గనియెనారాజచంద్రుండు కాకవర్ణు, నతఁడుగాంచెను క్షేమవర్మ నెడిసుతుని. 156

సీ. ఆక్షేమవర్మకు సుక్షేత్రుఁడుదయించె నతనికి విధిసారుఁడనెడుసుతుఁడు
జనియించె నావిధిసారునకును బర్బకుఁడు పుట్టె మఱి బర్బకునకు రాజ
నేయుఁడాధారుణీనేతకు నందివర్ధనుఁ బట్టినందివర్ధనుఁడుగాంచెఁ
బ్రీతి మహానందినాతండుఁగనె శిశునాగపార్థివుని నానరవరునకుఁ

తే. గలిగె సుజ్యుఁడు సుజ్యభూకాంతునకును, వసువు వసునకు భద్రకవసుమతీశుఁ
డమ్మహాత్మునకును బుళిందాభిధానుఁ, డామహారాజునకు ఘోషుఁడనఁగ సుతుఁడు.

వ. కలిగెనాఘోషునకు ద్విపిమిత్రుండు, ఆరాజచంద్రునకు భగవంతుండు, ఆమహీపాలాగ్రణికి దేవభూమి, ఆభూస్వన్మణికి భూమిత్రుండు, ఆన్యకంఠీరవునకు నారాయణుండు, ఆసతతదానోత్సవునకు సుశర్మకృష్ణులు, ఆయశోధనులందుఁగృష్ణునకు శ్రీశాంతతనుండు, ఆబంధుమందారునకుఁ బౌర్ణమాసుండు, ఆమహావీరునకు లంబోదరుండు, ఆప్రతాపమార్తాండునకు బలికుండు, ఆవైరిసంహారునకు మేఘుండు, ఆభోగదేవేంద్రునకు స్వాతి, ఆసుగుణాభిరామునకు దండమానుండు, ఆచండవిక్రమునకు నరిష్టకర్ముండు, ఆపుణ్యమూర్తికి హాలేయుండు, ఆశూరాగ్రణికిఁ దిలకుండు, ఆశ్రితజనావనునకుఁ బుషతోషుండు, ఆధర్మాత్మునకు సునందుండు, ఆసుమతికి వృకుండు, ఆనీతిపరునకుఁ జటకుండు, ఆయఖండలక్ష్మీప్రసన్నునకు వివసాతి, ఆసతతకృతాధ్వరోత్సాహునకు నరిదమనుండు, ఆమేరుధీరునకు గోమతి, ఆహరిహరభక్తునకుఁ బురిముండు, ఆకలుషవిదారునికి శ్వేతుండు, ఆయనఘునికి వేతాసితుండు, ఆయతిరథశ్రేష్ఠునకు స్కందుండు, ఆమహోరస్కునకు యజ్ఞశాంతుండు, ఆభూభుజునకు విజయుండు, ఆపయోధిగంభీరునకుఁ జంద్రబీజుండు, ఆచంద్రవత్ప్రియదర్శనునకు మనువు, ఆమనుమార్గచరితునకు నందుండు, ఆనందనందన పదారవిందసేవాసక్తునకు భూతనంది, ఆచిత్రజసమానాకారునకు నంది, ఆరాజపరమేశ్వరునకు శిశునంది యశోనందియన నిద్దఱు జనియించిరి. ఆసింహపరాక్రము లిరువురకుఁ బదునలుగురు సుతులుదయించి వారలు బాహ్లికదేశాధీశులైన, వారితోఁ బుత్రమిత్రుండు దుర్మిత్రుండుననురాజు లిరువురేకస్థులై కయ్యంబునం బోదివిన నాపదునలుగురోపినంతపెనంగి యొక్కకాలంబునం బాహ్లికదేశంబు విడిచి యేడ్గురు కోసదేశాధిపతులైరి. మఱియు నేడ్గురునాంధ్రదేశాధీశ్వరులైరి. అందు నందక్ష్మాపాలవర్యుండు దనపేర నందపురంబనుపురంబుఁ గావించి యదిదనకు రాజధానిగా నసదృశపరాక్రమంబున సేతుగోదావరీపర్యంతమహీమం

డలంబునకంటకంబుఁగావించి యదిదనకు నేలుబడిగాఁ బ్రతిదినవిరచితషోడశమహా
దానపరతంత్రుండై ప్రతాపనిర్జితాశేషభూపాలుండై ప్రవర్ధమానయశశ్శకర్పూర
పూరితాజాండకరండుండై సకలవిద్యావిశారదుండై పరఁగుచుండి. 158

తే. అహరహము యోగపాదుకామహిమచే సు,రాపగను స్నానమొనరించియరుగుదెంచు
చున్నచో వేఁడుకొని సతియొక్కనాఁడు, వెంటనంటిన నందభూవిభుఁడుసనియె.

క. సతితోనిటులనె నంద, క్షితిపాలుఁడుగాశికేగి చేసెను స్నానం
బతివ రజస్వలయైనను, గతి మునుపటివలెను బాదుకల లేకున్నన్. 160

క. చింతించి నందుఁడటుఁదన, చెంతనుగలపంచశతము క్షితిసురులకు నే
కాంతమునఁ దెలిపెఁ దనవృ,త్తాంతము వారందు కాత్మనలరుచుఁబతితోన్. 161

క. మంచిదిగాకవనీశ్వర, పంచాస్యా భూమిసురులప్రార్థన వృథగా
వించునె నీవేలెడుపుర, మంచితగతి మాకొసంగుమననిత్తుననెన్. 162

క. వారంగుకునోడఁబడియా, భూరమణునినారితోన పురిఁదొంటిగతిన్
జేరఁదమమహిమఁజేసిరి, యారాజీవోద్భవాన్వయావళియంతన్. 163

క. చనుదెంచి నందమహీపతి, తనపురమాద్విజులకొసఁగి తానొండు పురం
బున నిలిచియేలె ధారుణి, జనసన్నుతులెసఁగ సకలసౌఖ్యోన్నతుఁడై. 164

వ. ఆనందమహీమండలేశ్వరునకుఁ దొమ్మిదవవాఁడై చళుక్యభూపాలుం డుదయించె
నతండు సహస్రబాహుబలె విదళితాహితచతురంగబలాలంకృతరణరంగవిజయర
మాకరగ్రహణోత్సాహుండును, సహస్రఫణాధరుబలె సర్వసర్వంసహాభారభరణుం
డును, సహస్రకిరణుబలె నిఖిలదిక్ప్రకాశితతేజుండును, సహస్రలోచనుబలె భువ
నవృత్తాంతాలోకనతత్పరుండును నై, శరణాగతరక్షణమొనర్చుచు సతతంబును
మఖంబులఁజేయించుచు ధర్మమార్గంబున ధరణిఁబాలించె. 165

తే. ఆచళుక్యవంశజులయినట్టినృపతు, లవనిఁబెక్కండ్రు పాలించిరంతనాకు
లాంబునిధిశశియాబిజ్జళాఖ్యనృపతి, పుట్టి ధరనేలె వైరుల మట్టుఁబెట్టి. 166

సీ. క్ష్మాభరణంబగుకల్యాణపురమేలి కల్యాణబిజ్జళాఖ్యను వహించి
దుష్టనిగ్రహమును శిష్టరక్షణమును బూనికావించుచు భూజనముల
నయమార్గమునఁ బ్రోచి నాల్గుపాదముల ధర్మము పరిక్షితురీతి మహిని మెలఁగఁ
జేసి దీనార్థుల శ్రీదులఁగావించి ఘనమగుకీర్తి నల్గడల నించి

తే. యసదృశపరాక్రమక్రీడనతిశయిల్లి, భరతకురునృగనలధరాపతులఁబోలి
వితరణాదిగుణాళిచే వినుతికెక్కి, వెలసెఁగల్యాణబిజ్జళవిభుఁడు మిగుల. 167

## బి రు ద గ ద్య ము.

జయజయ, స్వస్తి, సమధిగత పంచమహాశబ్ద, మహామండలేశ్వర, కల్యాణపుర వరాధీశ్వర, ఆత్రేయసగోత్ర, క్షత్రియాచారకులపవిత్ర, చాళుక్యనారాయణ, చాళుక్యచక్రవర్తి, మండలీకరగండ ధరణీవరాహ, వెంగత్రిభువనీమల్ల, పాయకాభుణు పయిలేజుజ్జారుబొల్లితే జొల్లియాన్, సాములామణివిలె మణివియాన్, సాములా జక్కిడీవరాజాయతెక్కిడీలు మన్నియాన్, సాములాతాకు ఉత్సాయి బాహు అల వీతో మన్నియాన్, సాములాజాళుకాళుపడుకాయి తే మన్నియాన్, సాములాయ బాలుతలెసలితె మన్నియాన్, సాములాబయిత్సైనైత్సాత్రవిసాపాణవితే మన్ని యాన్, సాములాకాలేభిడిపాడ్రిపాతుకాయితు మన్నియాన్, సాములాభర్త రూదిగుడాకుంజకాళాఘోరాసాశాబాహుత్తువర్న మన్నియాన్, సాములాసామోరు దావతే సప్పుసాళు తేభాగియాతే ముత్తిశియోసరితే మన్నియాన్, సాములాపోడు ఉరగలాశి ఉపరిదేఖతేమన్నియాన్, సాభర్తారు, శ్రీరాజ, రాజపరమేశ్వర, శ్రీ రాజరాజేశ్వరదివ్యశ్రీపాదపద్మారాధకాది మహాబిరుదాపదానోజ్జ్వల, కల్యాణబిజ్జ లేశ్వర, విజయీభవ, దిగ్విజయీభవ. 168

తే. అని పొగడ్తను నెక్కెఁ గళ్యాణబిజ్జ, లక్షితీశుఁడారాజలలామునకును
మనుమఁడైనట్టి వీరహొమ్మాళిరాయఁ, డవనిఁ బాలించె సకలజనాళి మెచ్చ. 169

క. కలనైననలజడనియెడి, పలుకాభూవరుఁడు జనులు పలుకకయుండన్
విలుకోఁపునఁగావించెను, బలశౌర్యములఖిలనృపులు ప్రణుతియొనర్పన్. 170

వ. ఆవీరహొమ్మాళిరాయమహీపాలుండొక్కనాఁడు నూఱువేలరథంబులు లక్షయేనుం గులన్నిగుఱ్ఱంబులు శతసహస్రాయుతపదాతివర్గంబునుగొలిచిరా, జయదుందుభిస్వన ప్రకంపితాచలకందరకంకీరవుండై, సర్వాలంకృతాభిరామంబై సకలసంపదలకునికి పట్టై పరమభాగవతజనాకీర్ణంబై పరాభేద్యంబై వీరనారాయణదేవనివాసంబై యొ ప్పుగంగాపురాఖ్యపఁ బ్రతినామంబుగల మాయాపురంబునకరుగుదెంచి, పౌరులెదు రుకొన రాజగృహంబుం బ్రవేశించియుచితకరణీయంబులొనరించియారాత్రిసుఖ నిద్రఁజెంది, మఱునాఁడరుణోదయంబున స్నానసంధ్యాద్యనుష్ఠానంబులొనర్చి, మున్ను తనచేఁబ్రతిష్ఠచేయఁబడినచెన్నకేశవస్వామిదేవాలయంబునకరిగియద్దేవునకు సద్భక్తినురంబుననున్నపదకమణులు చ్యుతిగాఁ గరయుగంబునఁ గర్ణయుగళంబు మూసికొని ప్రవరాన్వితసగోత్రనామసహితసాష్టాంగనమస్కారంబులాచరించి, తత్ప్రసాదంబు మాళినిడి యహర్ముఖాదారభ్య సాయంసమయావధి దేవాలయంబు

ప్రదక్షిణంబుఁ గావింతునని విద్వజ్జనసమక్షంబున సంకల్పంబుఁ గావించి, చెన్న కేశవస్వామిదివ్యశ్రీపాదపద్మంబులు నిండు డెందంబను నరవిందమధ్యంబునం బొందు పఱిచి, మందమందగమనమున శ్రీహరిసహస్రనామంబులు చర్చించుచుఁ బెద్దలగు బ్రాహ్మణులు వెంట రాఁ దన్మార్గంబునఁ దనుక్లేశంబున కోర్చి ప్రదక్షిణంబొనరించు నెడఁ ప్రదక్షి.. ప్రదక్షిణంబునకు గరుడస్తంభోపకంఠభూమి నుదురంట సాష్టాంగదండప్రణామంబొనర్చుచుఁ దక్షిణంబుదుగక ప్రదక్షిణనమస్కారంబు సేయుచు, సాయంకాలసమయంబునం బ్రదక్షిణం బొనర్చి గరుడస్తంభంబుచెంత నిలిచి బ్రాహ్మణజనంబు లిరువంకలఁ దోలంగ సాష్టాంగదండనమస్కారం బొనర్చుచు నర్చి శంఖచక్రముద్రితస్థాపితోపసంఘర్షణోపలక్షితశంఖచక్రలాంఛిత భుజయుగళుండైన నిరీక్షించి విద్వజ్జనంబులు పౌరులు బంధువులు మంత్రిసామంతపరివారనికరంబును విస్మయంబంది యితనిచరితంబు దివ్యంబని పలువెఱంగులం గొనియాడిరంత నావీరహోబ్మళిరాయమహామండలాఖండలుండు నిజపురంబునకరుగుదెంచి వీరనారాయణదేవ చరణాంభోరుహారాధనానుసంప్రాపిత సకలసామ్రాజ్యవిశేషభోగంబులుం బరమభాగవతజనసఖిత్వంబునుం గల్గి పెద్దకాలంబు ధాత్రిఁ బాలించుచుండె. 171

తే. ఆమహారాజునకు సుతుండైనతాత, పిన్నమమహీశ్వరేశుఁడు పృథివి నేలె
రంతిహైహయన సగరనృగపూరు, భరతశశిబిందుకుసుమహీవరులఁ బోలి. 172

క. ఆతాతపిన్ననృపవరుఁ, డాంతతభుజవిక్రమమున నహితోర్వీశ
వ్రాతముల గెలిచి ధర వి, ఖ్యాతిగఁ దద్ధన మొసంగి క్రతువులఁ జేసెన్. 173

## బిరుదగద్యము.

స్వస్తి, సమస్తసద్గుణాభిరామ, రాజరాజాన్వయాబ్ధిసోమ, నిస్తులౌదార్యనిరాకృతసూర్యనందన, వైరిభూపాలాభినందన, సమస్తసురాచారచెలుకురాచనాయకరాజసప్తాంగహరణ, నతదిగన్తరాగతనృపతినికరముకుటమణిఘృణివిరాజితచరణ, శరణాగతవరద, మన్యపులిబిరుద, మహామండలాధిగతకర్ణాటకశాసన, వైభవపాకశాసన, వీరహోబ్మళిరాయతనూజ, తాతపిన్నరాజ, జయ, విజయీభవ. 174

వ. అనియారాజేంద్రుండు వందిజనవందితుండగు. 175

ఆ. తాతపిన్ననృపసుధాధామవరకీర్తి, చన్ద్రికాభిరామసరణి యమరుఁ
గాశిసేతుమధ్యకటకవనీపక, జనచకోరములకు సమ్మదముగ. 176

ఆ. తాతపిన్నరాట్ప్రతాపంబు మిక్కిలి నిండి పర్వఁగమలజాండమలరె

విజయజలజనయన వేడ్కఁ జేఁగైకొన్న, కుంకుమంపుబరణికొమరునమరి. 177

చ. అతనికి సోమదేవవసుధాధిపుఁ డుద్భవమంది నిర్జితా
హితుఁడయి తాల్చె భూభరమహీనపరాక్రమకేళి నెన్నఁగా
క్షితిధరజామనోహరునికిం బ్రతియౌచును నీతిచే బృహ
స్పతిసరిఁ బోలి ధర్మమునఁ బాండుసుతాగ్రజుజోడుకోడయై. 178

క. సకలజనంబులు సిరులం, దొకటను నచ్చికము లేకనుండఁ గనుచుచుం
బ్రకటముగ ధనము విప్రతతికి నిడి సవనములు సోమదేవుఁ డొనర్చెన్. 179

సీ. బలవంతుఁ డగు నడబాలనాయకునిని శూరుఁ డౌ గుజ్జలవీరినేని
రౌద్రరసోన్నిద్రు రుద్రపాధిపు మహాశౌర్యు గౌరాపరెడ్డి సాహసాంకు
గంగినాయకుని సంగ్రామరంగంబున సింగంబు మత్తమాతంగజములఁ
బట్టుకైవడిఁ బట్టి చట్టలెత్తించి కిన్కను నసహాయుండునై గంగినేని
తే. కొండప్రాగ్ద్వారసీమనుద్దండవృత్తిఁ, గంబములఁ బాఁతి తోరణగాఁగఁ గట్టి
వినుతికెక్కెను సకలభూజనులచేత, సోమదేవనృపాలసుత్రాముఁ డెలమి. 180

సీ. కదనరంగంబునఁ గరితురంగమవీరవితతితోఁ బలుమాఱు విఱుగఁదోలి
యమితోగ్రశౌర్య మహమ్మదుఁ బట్టి నీపేరఁ బెట్టెదనుగుమారునకద
గాక భవత్పాదకమలంబు నుదురంట దండంబుఁ బెట్టెదఁ దన్నుఁ గాచి
విడువుమన్ననుగాచి విడిచి యర్థులకును షష్టిశతంబు నశ్వములవాని
తే. చేతనిప్పించి శరణన్నఁ బ్రీతిఁ గాచు, బిరుదు తగు నీతనికె యని ధరణిపతులు
సన్నుతింపఁగ నాదిరాజన్యచర్యఁ, దేజరిలె సోమదేవధాత్రీవరుండు. 181

సీ. దండెత్తి చని మహోద్దండవృత్తిని గంగినేనికొండవలీలగానుగట్టి
కందనవోలునగలువకోలునుగోటరాచూరు నెటువంటిరాజుకైన
సాధింపరాని మొసలిమడుగు మఱియాతగిరినగరము సాతానికోట
వరుసతో సాధించి పరమహర్షంబునఁ దత్తన్మహాజనతతులఁ బ్రోచి
తే. ధరకుఁ దొడవని వినుతింపఁ దగిన యట్టి, యారవీటిపురాధ్యక్షుఁ డగుచుఁ దాత
పిన్ననృపసోమదేవుండె యెన్నదగియె, నఖిలసత్కవిసురభూజమనుచు నెప్పుడు 182

## బిరుదగద్యము.

జయజయ, నిఖిలమహాభాగవతముఖ్యవిఖ్యాతకీర్తి, ఏకదివసఘటికైకఘాటీహఠా
హృతకోటరాచూరు సాతానికోట కందనవోలు యాతగిరి కలువకొల్లు మొసలి
మడుగు గంగినేనికొండాభిధానసప్తదుర్గప్రవర్తి స్థలదుర్గ జలదుర్గ గిరిదుర్గ వనదుర్గ

చారాశిదుర్గ విఘాళ, సముద్ఘుష్యమాణబిరుదాపదాన హాళహాళికాకర్ణనపులకితక పోల, నాకులపాటిముదుగంట్యానెగొందికుంతిసరవిజయలక్ష్మీసమక్షీకరణలక్షిత, నాకులపాటివీరక్షేత్రభారతీమల్ల ముదుగంటివీరక్షేత్రభారతీమల్ల ఆనెగొందివీర క్షేత్రభారతీమల్ల కుంతివీరక్షేత్రభారతీమల్ల వీరక్షేత్రభారతీమల్ల బిరుదభరితాను భావ, స్వభావగంభీరాంభోనిధి, సత్త్వగుణవాసుదేవ, సకలనరదేవచూడామణి, అసి భరణపటిమసహదేవ, ఆదిదేవ, సుపర్వరమణీమణిస్తుత, వరద, భయద, హొసబిరు దరగండ, పరప్రతాపబిరుద, బిరుదుమన్నెరగండ, పురిగోలసురత్రాణ, శరణాగత త్రాణబిరుద, రాయరణరంగభీభత్స, రాయరాహుత్తరగండ, ధైర్యవరగండ, గండర గండ, తాతపిన్నమరాజతనూజ, సోమదేవరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 183

వ. అని బిరుదులం బొగడ మహీతలంబుం బాలించె. 184

మ. హరిశౌర్యం డగు సోమదేవవసుధాధ్యక్షేశుసత్కీర్తి భా
సురతన్మద్దెసలెల్ల నిండి తగం బొల్చున్ భూజనస్తుత్యమై
హరమందారపటీరహీరకలశాంభోబ్జాహిరాట్పారదా
శరదభ్రాంబుజగర్భసూనులవలక్షుసూఫూర్తివారింపుచున్. 185

ఉ. ఇమ్మహి సోమదేవమనుజేంద్రుప్రతాపము నిండి దిక్కులన్
బమ్మినం జూతపోతనవపల్లవబింబఫలారుణాంబుజా
తమ్ములటంచుం గోకిలకదంబము కీరచయంబు చంచరీ
కమ్ములు గ్రమ్ముచుండు నొడికంబుగ భ్రాంతివహించి పల్లవుల్. 186

తే. సోమకులదీపకుం డగు సోమదేవ, రాజవరునకు నుదయించి రాఘవేంద్రుం
డఖిలనృపతులు ముకుళితహస్తులగుచుం, గొలువ ధరయేలె నతండు దోర్బలము మెఱసి.

సీ. ఎదిరించువైరులమదమడంపను శరణనినను రక్షింపనతండె నేర్చు
భావింప జనులకు భయముం బుట్టింపనాహ్లాదము నొనరింపనతండె నేర్చుం
బరపుణ్యమ్ముదప్పక నడవను జనతపిచేత నడపింపనతండె నేర్చుం
గమనీయనీతిమార్గము దెలివిగం దెలియను దాను దెల్పను నతండె నేర్చు

తే. నార్యజనులను బోషింపనతండె నేర్చుం, గాని యొరులందునీ నేర్పు గానుపింప
దనుచు సకలజనంబులు వినుతిసేయ, వెలసె నెంతయు రాఘవోర్వీభుజుండు. 188

## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, నిస్తులప్రతాపతపనోదయనిరస్తపరిపంథిసామంతాధికా రాంధకార, వసుంధరాభారభరణధురంధర, సీమంతినీజనమందహాస చంద్రికా

వికాస, అనన్యసామాన్యసకలగుణనివాస, యవనబలమర్దనోత్సాహ, తులువబలసం
హారవిహార, శబరకులబలనిహననవినోద, వాసుదేవచరణకమలసేవాసక్తచిత్త, శర
ణాగతవజ్రపంజర, వీరవ్రతశీల, కవికులసరసకవితాకర్ణనకర్ణాభరణ, మహాదానకంక
ణమణికంకణ, ఉత్సాహసహాయ, శౌర్యసామ్రాజ్య, సోమదేవరాజతనూజ, రాఘ
వరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 189

వ. అని కవిభటానీకంబులు పొగడ, రాఘవమహీపాలుండు ధర్మంబున రాజ్యంబేలె.

సీ. జహ్నుతనూభవ జవగతినుడుగక కడువడిఁబఱచి సాగరముఁజేరెఁ
గల్పద్రుమములైదు కంపించి శాఖోపశాఖల మిగులనాశలకుఁబాఱె
భుజగేశుఁడెంతేని బుసచేత మలకలుమలకలుగా రసాతలముఁదూఱె
సురధేనువొకవడిఁబఱుపున వనిఁజేరి పూరినిఁగరిచెను సారెసారె

తే. నౌర వీరారిగర్వవిదారియైన, సోమదేవునిరాఘవక్షోణిపాలు
దశదిశాత్యంతపరిపూర్ణధవళకీర్తి, లలితనిర్మలరుచిహాళాహాళికి వెదరి. 191

మ. అరయన్ రాఘవుపావకాంబకము మున్నావాహినీనాథునా
క్రూరునిన్ క్రుక్కఁగఁజేసె రాఘవమహీకాన్తామనోహారిబం
ధురతేజంబనుపావకామ్బకము శత్రుక్షోణిభృద్వాహినీ
శ్వరులన్ బెక్కురనుక్కడంచునని చున్ వర్ణింతురుర్వీజనుల్. 192

చ. పరబలభేది రాఘవనృపాలుఁడు పంకజనాభుఁగూర్చియ
ధ్వరములనగ్రహారములుదాత్తమతిన్ దగఁజేసి ధారుణీ
సురులకొసంగెఁబర్వముల శుద్ధసువర్ణగవాదిదానముల్
గరిమనుబిన్నశౌరిని జగద్వినుతున్ ఘనుఁగాంచె వేడుకన్. 193

క. ఆపిన్నశౌరి శాత్రవ, భూపాలురనెల్లఁగలనఁబొరిగొని బాహా
టోపమున నేలె ధర సుఖ, మాపాదించుచును జనులకలజడి మాన్పెన్. 194

చ. కుపితవిరోధిరాజమదకుంజరసింహము పిన్నశౌరియే
లుపుడమియందు నెందుఁగలలోపలనైనను గేలినైనన్
గృపణవిధంబు లోభమును గిల్బిషవర్తనబొంకునోటమిన్
గపటమసూయగోపమును గర్వముఁబుట్టదు లేశమాత్రమున్. 195

చ. అనఘుఁడు పిన్నశౌరి సుజనావనదక్షత రూపరేఖలన్
వినుతపరాక్రమంబునను విశ్రుతదానగుణంబు పెంపునన్
వనజదళాక్షుఁడత్తనయు వానివిరోధిని వానిమిత్రుఁదా
నెనయగు దీటువచ్చు మఱియెంతయు సాటగుఁజూడఁజూడఁగన్. 196

తే. పిన్నశౌరియశము వెన్నెలకౌశాళి, విన్నవాఁకఁ బలుకువెలఁదిఁ బుడుకు
వాఁడుకు రిక్కచేని నాడలిచూపాడయని, మేటితేజిఁబోలు దీటు లేమి. 197

ఆ. వైరిధారుణీశవంశపారావార, ముల దహించు మిగులఁ జెలఁగి జనులు
సన్నుతింపఁ బిన్నశౌరిప్రతాపంబు, బాడబానలంబుపగిదిఁ దనరి. 193

క. ఆరాజేంద్రుఁడు బుక్కధ, రారమణునిఁ గాంచెనతఁడు రాజకులసుధా
పారావారనిశాకరుఁ, డై రాజిలె సరససత్కళాయాఢిమెయిన్. 199

చ అతివిభవంబునన్ధితిసుతాహితరాజు మహాపరాక్రమో
న్నతి మృగరాజు సోయగమునన్మరురాజు సమస్తధర్మప
ద్ధతినలధర్మరాజు పటుధైర్యమునన్గిరిరాజు వాక్ప్రశ
స్తత ఫణిరాజు నిర్దళితశాత్రవరాజగు బుక్కరాజిలన్. 200

శా. చక్షుశ్శ్రోత్రనరాహకూర్మగిరిరాట్సాంగత్యమున్మాని సం
రక్షాపేక్ష మనంబునన్దలఁచి గోత్రాదేవియొల్లప్పుఁడా
నక్షీణాధ్వరదైయి మహాసుకృతదైయి యాయూధతంబొల్చె స
ర్వక్షేమంకరుఁడైనబుక్కవిభుశౌర్యస్ఫారదోర్గపీఠిపైన్. 201

సీ. అడుగనిచ్చితినిశ్చయంతియ లేదనుమాటదాఁబుట్టదేనాఁటనైన
గెలిచి యిచ్చుటె కాని కలననోటమియనుమాటదాఁబుట్టదేనాఁటనైన
మనవెంతచెప్పిన విని పరాకుగఁజేయుమాటదాఁబుట్టదేనాఁటనైన
మొదటన చనవిచ్చి తుదనది వేఱగుమాటదాఁబుట్టదేనాఁటనైన
తే. ననుచు జనులెల్లఁబొగడఁగ నారవీటి, పురము నేలుచుఁ దనకులమును దదాఖ్య
నలర వెలసెను సతతకృతాధ్వరుండు, రాజపరమేశ్వరుఁడు బుక్కరాజవిభుఁడు.

## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, శ్రీసంతత వేంకటాచలపతిచరణారవిందసేవాకందళిత సామ్రాజ్యసుఖోపభోగ, సాళువనరసింహరాయరాజ్యప్రతిష్ఠాపనాచార్య, శౌర్యగరిష్ఠ, సకలకళావిశారద, దైనందినవితరణనానాదిగంతరాగతవనీపకజాలపరిపాలనగుణవిశేష, అసహాయశౌర్య, సుమేరుధైర్య, అష్టాదశవిద్యాప్రజ్ఞాప్రవీణ, రాజకులాభరణ, రాజరాజేశ్వర, పిన్నశౌరిరాజతనూజ, బుక్కరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 203

క. అని సకలరాజసభలను, వినుతింపఁగ బుక్కరాజవిభుఁడొప్పెను స
జ్జనులను గాచుచు దుష్టులఁ, దునుముచు ధరనేలె మిగుల దోర్బలశక్తిన్. 204

క. సోమాన్వయాబ్ధిరాకా, సోముండగుబుక్కరాజ సుత్రాముయశ
శ్రీమించెఁ దెగడె గెలిచెను, గామదుఘున్ గామపాలుఁ గామవిదారిన్. 205

మ. పురముల్మూటిని నొక్కపెట్టునను రూపున్మాపు నీశానుపెం
పరయంజాలిన బుక్కరాజమణియవ్యగ్రప్రతాపంబు మే
దురమై దిక్కులనిండఁ బర్వుచుఁ గవిహోత్రక్రియాపాత్రమై
సారిదిన్ శాత్రవకాననంబుల దహించున్దావవహ్నిక్రియన్. 206

సీ. ఆబుక్కరాజేంద్రుఁ డబ్బళదేవి బల్లాదేవి యనుసతులను వరించి
యబ్బళదేవియందాత్మజులను సింగవిభుఁడాదిగాఁగను వేడ్కఁ గాంచి
నందేలయొసఁగ నానందనులాపురిఁ దమకును నిజరాజధానిగాఁగ
నేలుచుఁగులము నందేలపేర ధరిత్రిఁ దనరఁగఁ బుత్రపౌత్రాభివృద్ధి
తే. నతిశయిల్లిరి పుడమియును నానృపాలుఁ, డనఘతనుఁడు బల్లాదేవియందు రామ
భద్రవరలబ్ధజనితునద్భుతశౌర్యు, భానునిభతేజు రామభూపాలుఁగనియె. 207

సీ. మదకరికొకటికిర్వది గుఱ్ఱములు గుఱ్ఱమునకును వీరుకాండ్రు ముగురు విచ్చు
కత్తులవారికెకాండ్రట్లవర్తిల్లనిట్టియేనుఁగులనుజొట్టు మూడు
వేలయేనూఱునుద్వృత్తితో నడపంగఁ గందనోల్సాధింపఁగాఁదలంచి
మొనఁద్రుంచి గట్టిగా ముట్టడిదిగినసాబిబ్బని మిక్కిలియుబ్బణంచి
తే. ప్రకటసప్తాంగములఁగొని రామవిభుఁడు, కందనోల్రాజధానియుఁగాఁగ వసుమ
తియును నేలి మహోన్నతదీక్షఁ బూనె, బలిమికలిమినాకాశనీపతులఁ బెనుప. 208

చ. మగఁటిమికోర్వలేక దయమాలటు జ్ఞాతినియుక్తబుద్ధిచే
సగరతఁగన్నతీర్థమిడఁ జాలక నర్భకుఁడున్నఁ జూచి శ్రీ
నగధర నీవె దిక్కని జనంబులుగన్గొనవంతఁ గ్రోలియా
సగరునిఁబోలి రామనృపచంద్రుఁడు చెందఁడు తద్వికారమున్. 209

## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి సమస్తిసమరసమయ బలరజోమిళితసప్తసాగర ఘుంఘుమితకల్లోలజాల, శరణాగతపాల, హల్లిసుసేనోల్లాసిత సప్తశతసైంధవ గ్రహణపరాక్రమధుర్య, రత్నసానుధైర్య, దుర్వారతరసవాయిసైనికహరణ, సవాబిబ్బిరాజసప్తాంగహరణమార్గచరణ, రణభయానకజయానకారవముఖరీకృతకులగిరిదరీనికర, పోషితావనిసురప్రకర, నిరవాపాదవసీదుర్గనివాసికాసపుడయ దుర్మదఖలనిర్మథన, కర్మధౌరేయ, దానరాధేయ, వీరరమాసమారోహణారంభసోపానదో

స్త్రసంభ, వాక్కాంభోజనసార్వభౌమారంభ, పరిపంథినృపపుండరీకాధిపరాజమండల
కబళనవ్యగ్రమోదగ్రపంచాస్యగ్రసింహికాతనూజ, రామరాజ, విజయీభవ, దిగ్వి
జయీభవ. 210

క. అని బిరుదు పొగడఁగా బుక్కనృపాలునిరామభూమికాంతుండలరున్
వననిధిపరికరధాత్రి, జనములు నయమార్తిఁ బ్రోచి సన్నుతిఁగనుచున్. 211

సీ. పరమధర్మంబున బరవిభవంబున సరి ధర్మతనయుండు హరిహయుండు
సత్కాంతిసొంపున సంపదపెంపునఁ బ్రతి యామినీరాజు రాజరాజు
కమనీయగుణమున ఘనవితరణమున నెన దశరథరాముఁడినసుతుండు
విక్రమస్ఫూర్తి సద్వ్యయములతేజోభివృద్ధి సాటి నరుండు వైశ్వానరుండు
తే. గానియితరులు నెటు దీటుగా నుతింప, నచ్చు సతతనతసకలవసుమతీశ
మకుటమణిఘృణిసువిరాజమానచరణ, జలరుహుండగురామరాజప్రభునకు. 212

సీ. జగడాలు పచరించుజనదారిఁ జౌదంతిఁదలవాకిట నెపుడు మెలఁగుపాలఁతి
నల్లవాలునదాల్పుఁజెల్లనిజలుఁడీవిఁ గన్నులుచెవులుగాఁగలుగు హేని
వెన్నునిమున్నున్న వేల్పులదొరవాలునజుపదిమోములనలరుసామిఁ
జుట్టుకైదువులోను నిట్టులరయుకిరిరాణిఁ బుడుకుఁదొడుకుమటిపుడుకుఁ జెట్టు
తే. బొబ్బమొకమును నిరింపమబ్బునుబ్బు, గెబ్బ సంతతవిజయజేగీయమాన
మగుచుఁ జాళుక్యనారాయణాంకఁదైన, బుక్కరాజేంద్రురామభూభుజునియశము.

మ. ఒకకందర్పునిఁగూల్చె శంకరునిఁ బ్రోద్రేకఫాలాక్షిపా
వకుఁడేహా ప్పుడు రామభూవిభునిమద్వీర్యప్రతాపాగ్ని వా
రక విద్వేషిమనోజగర్వముల సంగ్రామక్షమామండలిన్
వికలత్వంబు వహింపఁజేసె సకలోర్వీనాయకుల్మెచ్చఁగన్. 214

చ. సరసిజసద్మతో ముగుల సాటగు లక్షణలక్షితాంగియై
పరఁగినలక్కమాంబను వివాహము బుక్కనృపాలురామభూ
వరుఁడయి యామ్రలోమజను వాసవుఁబోలి మహానురక్తి సు
స్థిరతరభోగభాగ్యములఁ దేల్పులఁజేసెను లక్కమాంబతోన్. 215

క. ఆరామనృపతికి మహో, దారుండగుతిమ్మరాజు ధన్యుఁడు కొండ
మ్మారమణుఁడు బుక్కనృపస, చ్చారిత్రుఁడు రంగవిభుఁడు జనియించిరిగన్. 216

క. ఆతతభుజబలమున రిపు, భూతలనాయకులఁగలనఁ బోరిగొని కీర్తి
శ్రీతరుణిఁ గాంచె విద్వ, ద్వ్రాతములకుఁ దిమ్మనృపతి ధనమిడి వేడ్కన్. 217

క. ఆతిమ్మనృపతి భూకాంతాతిలకంబై నయపథంబునఁ దా నేలుచు వి
ఖ్యాతిగ నప్పరిపేరన్, బ్రీతిం దనకులము వెలయఁ గొంపొందె మహిన్. 218

క. ఖండనభూమిని సాత్త్వా, గ్గాండీవి దలంపఁగ నొప్పెడు ధాత్రీనాథా
ఖండలుఁ డగునని రిపుభూ, మండలపతులెత్తుఁ గరి నమస్కృతులతోడన్. 219

క. దీనావనుఁ డౌకొండము, హీనాఘుం డాదవేని నేలుచుఁ బోరన్
దానును సుతులును దర్పం, బానం బాయాదవేనిధామము నేలెన్. 220

క. ఆరాజన్యులతమ్ముఁడు, శ్రీరంగాధీశ్వరుండు శ్రీతసంరక్షా
ధౌరంధర్యముచే నా, శ్రీరంగాధీశుఁ డనఁగఁ గీర్తి నుతిఁ గాంచెన్.  221

సీ. అంతరకరణశుద్ధినైన నవ్వులకైన నాడినమాటలు సత్యంబు తేట
యనురక్తితోనైన నలకలనైన నింపొదవెడుచూపు సంపదలఁగూర్చు
కృతమతినైన సత్క్రీడానుగతినైన నలరెడుకేలు పుష్యంబు లొసఁగి
మమతతోనైన నేమఱిరైయినఁ దొడఁబడుకీర్తన పెంపు మిగుల ధర్మంబు సొంపు

తే. గాఁగనసదృశబాహువిక్రమునిఁ బోలఁ, దనరెఁ గర్ణాటరాజ్యవదస్థుఁడగుచు
దుర్జయాహితరాజవిధుంతుదుండు, రామరాజేంద్రుఁడు శ్రీరంగరాజవిభుఁడు. 222

శా. రామాధీశ సిరంగరాజవిభుఁడౌరా రాముతో సాటి సు
త్రామప్రోద్భవునుద్ధియాచు శరవిద్యాప్రౌఢచే మించియు
ద్దామామిత్రమహీశులం గెలిచి యుత్సాహంబుఁ బుట్టించి సం
గ్రామోర్విన్ జయలక్ష్మికిన్ వెసమనారాచాతిసేలాగతిన్. 223

చ. అసదృశబాహుశౌర్యమున నారయ నెంచుఁనజాతశత్రుఁడై
వసుధ సిరంగరాజజనవల్లభుఁడేలెడి యాదినంబులన్
బిసరుహమిత్రమండలముఁ భేద్యతనొంది చెలంగ రంభతో
నొసపరి బాగులం గదిసియుండఁగ గల్గెఁగు బేరసూతికిన్. 224

చ. అరయ సిరంగరాజమనుజాధిపునిర్మలకీర్తికాంతతో
సరిమెలఁగంగనోడి కద చాలనడంగి ముడింగి భీతిచే
నురువడిఁ బాఱి కాలెచట నూదుటలేక మొగంబు వాంచి యా
యురగకులాధిభర్త మహినోరయి పోవుట బ్రస్ఫుటెక్కుటల్. 225

మ. ఇల శ్రీరంగనృపప్రతాపముగడున్ హేరాళమై పర్వఁగా
నలఁగాంతాయుతులై చరించు రిపుభూనాథుల్ భయభ్రాంతిచేఁ
బ్రళయార్కాగ్నులు రెండునొక్కటయి భూభాగంబు వంగప్పి రా
వలయుం జూడుఁడటంచు నొండొరులతో వాక్రుత్తు రల్లప్పుడున్. 226

తే. ప్రకటసాత్త్వికుఁడైన శ్రీరంగరాజు, లక్ష్మికైనయైనలక్షణలక్షితాంగి
యైనతిమ్మాంబను వివాహమై చెలంగె, నధికతరభోగభాగ్యంబులతిశయిల్ల. 227

చ. అతనికిఁ దిమ్మమాంబకు గుణాఢ్యుఁడు కోనఘనుండు సత్కృపాం
చితమతి తిమ్మరాజు నృపసింహుఁడు రామవిభుండు నార్యస
న్నుతుఁడగు తిమ్మలేంద్రుఁడు మనోజనిభాకృతియైన వేంకట
క్షితిపతి పుట్టిరంతయును శిష్టుల దుష్టులఁ బెంపనొంపఁగన్. 228

ఉ. వారలలోన నగ్రజుఁడు వారిసముద్భవవైరివంశవి
స్తారుఁడు కోనభూపతి బుధప్రకరంబుల నైజదానదీ
క్షారతిఁ జండబాహుబలశాత్రవవర్గము నైజదానదీ
క్షారతి దివ్యభోగములఁ గల్గఁగఁ జేయు దయాతిసారతన్. 229

క. హితమతియగు కోనమహీ, పతి కీర్తికి నుద్దిగాఁగఁ బఱతెంచి తదం
చితగరిమ కోడిథయమున, క్షితిధరజాధిపుఁడు మూలశిఖరి వసించెన్. 230

ఆ. అతనియనుఁగుఁదమ్ముఁడగు తిమ్మభూపాల, వర్యుఁడలరుఁ గీర్తిధుర్యుఁడచల
ధైర్యుఁడార్యవినుతచర్యుఁడంభోధిగాం, భీర్యుఁడసదృశోరుశౌర్యుఁడనఁగ. 231

సీ. జేజేలరాయనిఁ జెనకి కైకొనియెనో వర్ణితంబైనట్టి వైభవంబుఁ
దలిరువిల్తునినోడఁదరిమి కైకొనియెనో సొగసైనయిటువంటిసోయగంబుఁ
బుడమిదాల్పునకనఁబోలి కైకొనియెనో యంచితంబైనవాక్సంచయంబు
నళికలోచనునటుగెలిచి కైకొనియెనో రహినిఁగుబ్బెడునిబ్బరంపుఁగలిమి

తే. ననఁగఁ దద్ఘనఖ్యాతినతిశయిల్లె, సర్వసర్వంసహాజనసన్నుతప్ర
తాపనిర్జితపరిపంథిధరణిపాల, తేజుఁడైనట్టియార్వీటితిమ్మనృపతి. 232

తే. తత్క్రమంబునఁ బ్రాలేయధామవంశ, మతికృతార్థత్వము వహింప హరిదలంచి
రామరాజననుదయించె నామహాత్ము, ననుజుఁ డిరుమలరాయనినలవె పొగడ. 233

సీ. పిశితభుక్కులకుఁ గృద్భీషణాశనియైనపంకజాక్షుండు నీపాటివాఁడు
భవ్యసత్కవులసంభరణుఁడై రంజిల్లుకైరవాప్తుండు నీదారివాఁడు
కరినేభలేఖారిగర్వాపహారియాధరశరాసనుడు నీకరణివాఁడు
ప్రస్ఫుటకమలజబాంధవుండైనట్టిజగదంబకుండు నీసాటివాఁడు

తే. అతికృపానూనకాంతిమహావిభూతి, తేజములఁగాక యితరులు దీటె యనుచుఁ
గవిజనానీకవర్ణనఁ గాంచి జగతి, రహి వహించెనుదిరుమలరాయమౌళి. 234

సీ. ఏఘనుసౌందర్యమిందిరానందనుసంపన్నై సతులకానందమొసఁగు
నెవ్వనివితరణమిందీవరాప్తునికీర్తినర్థులకతిప్రియమొనర్చు
నేరాజుభేరీభాంకారంబు రిపురాజతరుణులగర్భభేదనముఁ జేయు
నేనృపాలునిసేనయెదిరించునట్టిరాకుమారులనుజికాకుపఱచు
తే. నతఁడు నృపమాత్రుఁడేయరయను సపాద, కుతపశాహినిజామాదికుతలపతులఁ
జెండెదోర్దర్పఖర్వితాఖండలుండు, రణజయవిహారి తిరుమలరాయశౌరి. 235

చ. సరసిజపత్రనేత్రుఁడగుశౌరి పయోనిధికన్యకన్వియ
చ్చరులు నుతింపఁ జేకొనినచందమునన్సుగుణాభిరాముఁ డా
తిరుమలరాయశేఖరుఁడు ధీనుతులొప్పఁగ వెంగళాంబనుం
బరిణయమయ్యె వేడుకనపారమహావిభవంబులొప్పఁగన్. 236

క. పతిభక్తిచేనరుంధతి, ప్రతి సంపదచే సరోజభవనసరిగ స
న్నుతిఁగన్న వెంగళాంబకు, నితరవధూజనము సరిగ నెట్లెన్నఁదగున్. 237

శా. ఆరామామణియందుఁ దిర్మలనృపాధ్యక్షుండు ప్రేమన్ఘనున్
నీరేజాప్తసమానులన్సుతుల నిర్నిద్రప్రతాపారిసం
హారోగ్రప్రతిమానశౌర్య రఘునాథాఖ్యక్షమాభర్తనున్
శ్రీరంగాధిపు రామరాజవిభునిన్ శ్రీవేంకటాధీశ్వరున్. 238

క. ఆతిరుమలరాయతనూ, జాతచతుష్కమునన గ్రజనితుండును వి
ఖ్యాతయశుఁడు రఘునాథమ, హీతలనాథుఁడలరునినసన్నిభుఁడై. 239

మ. సమరోర్విన్రఘునాథరాజవరుఁడశ్వంబుద్ధతిన్దోలి శౌ
ర్యమృగేంద్రుండననొప్పి త్రుంచెనుదురుష్కాధీశులన్రౌతుఁబ
ల్లము గుజ్జంబున నాఱుతుంటలయి డొల్లన్వేటువేటట్లుగా
నమరుల్లగ్గని మేల్మెబాపు ఘళియానానంచు వర్ణింపఁగన్. 240

సీ. నీరూపురేఖతో నేసరియంచుఁ బెనంగి మీనాంకుఁడనంగుఁడయ్యె
నీవాక్సరణికెన నేనిల్తుననియోడి చిలువరాయఁడు రసాతలముఁ దూరె
నీకీర్తికిని జత నేననియటుగాక యబ్జారి చిన్నెగా హరిణమునిచె
నీప్రతాపముజోడు నేనని నిలువక ఖరకరుండుడువీథిఁబఱవఁ జొచ్చె
తే. నౌర నీసాటియితరులెట్లనఁగ వెలసె, నష్టదిగ్రాజహృదయభయదవరాహ
బిరుదకేతనుఁడరిగిరిభిదురపాణి, యైనరఘునాథమేదినీజానియలరు. 241

క. ఆరఘునాథమహాధా, త్రీరమణునియనుజుఁడైనశ్రీరంగవిభుం

పతికి జిహ్వ సరిగఁబిగిలెనంచును భీతి, సిరి మేన నీలిచీరఁగప్పె. 258

తే. మనుచరిత్రనిట్లు సుతుఁడు మన్మఁడునుదనర, నలరురామానపేక్ష ర్తకనుజుఁడైన
వీరవేంకటపతిరాయవిభుఁడు పసుధ, కెల్లరాజయ్యె భూజనులెల్లఁబొగడ. 259

సీ. బలముగూడినఁజూచి నిజపనియిభరాముకొడుకుభీతికి గోలకొండ సాక్షి
పెన్నాడి తత్సేన వేఁగఁ గోలుటకునుబృథురక్తమునను బ్బుపెన్న సాక్షి
కేవాఁడననఁ బ్రోచి నిర్భయంబుగ వానికిని మేరయిడుటకుఁగృష్ణ సాక్షి
యెదిరించుపైరులపద నెల్లనాలీలఁమాలించుటకును నందేల సాక్షి

తే. గాఁగనసదృశబాహువిక్రమవిభూతి, దనకు వేలూరు వరరాజధానిగాఁగ
వీరవేంకటపతిరాయవిభుఁడు మిగుల, ధరణిఁబాలించె ధర్మతత్పరతఁజెలఁగి. 260

సీ. వాజ్మహావిభవంబు వర్ణింతునంటినా భావింపఁబన్నగభర్తయతఁడు
గుణములచెలువుఁబేర్కొనియెదనంటినా వీక్షింప శేషాద్రివిభుఁడతండు
అతిధర్మవర్తన నుతియింతునంటినా రెండవయాధర్మజుండతండు
నీతిమార్గస్ఫూర్తిరీతిట్టిదంటినా పరికింపఁగా బృహస్పతియతండు

తే. గాన బుధజనసన్నుతిఁగన్నయార, వీటి వేంకటపతిరాయవిభునినితర
మనుజనాథులకీతిని వినుతిసేయ, నలవియేయాఘనుండు కేవలుఁడె తలఁప. 261

సీ. పరమపాతివ్రత్యగరిమచే మిక్కిలియతిశయిల్లినవెంకటమ్మగారిఁ
జిరయశోనిధియైనజిల్లెళ్లరంగనృపాధిపుపుత్రినోబమ్మగారి
జిల్లెళ్లకృష్ణరాట్ఛ్రితమయూఖుప్రియాత్మజయైనకృష్ణమ్మగారి
భూరిశౌర్యోగ్రగోబ్బూరియోబక్షమాధ్యక్షుతనూజఁగొండమ్మగారి

తే. నెమ్మి వరుసఁబాణిగ్రహణమ్ముఁజేసి, వీరవేంకటపతిరాయవిభుఁడు వేడ్క
నలరునప్పద్మముఖులతో ననుదినంబు, నధికసౌఖ్యాంబునిధినోలలాడె మిగుల. 262

ఉ. శ్రీరసుమేరువేంకటపతిక్షితినాథునిచారుకీర్తిదా
నారయఁబద్మజాండమున నంతట నిండి పొగడ్తఁగాంచె స
ద్ధీరులచేతనయ్యమృతదీధితికిన్భుజమధ్యమంబునన్
భూరికళంకమున్నెరపెఁ బోల్కికి నేనెనయంచుఁదోఁచినన్. 263

తే. రహినినిటువలె యామిసీరాజవంశ, వర్ధనుండగుతిరుమలవసుమతీశు
ననుజుఁడగువేంకటాద్రిరాజావతంసుఁ, డలరునాదిమనృపచర్య మెలఁగి మిగుల.

ఆ. అసదృశోరుశౌర్యుఁడాహవగాండీవి, వేంకటాద్రిరాజవిబుధరాజు
అని బరీదు గెలిచియాతనిబిరుదుమే, శమ్ముఁగొనియె భూజనమ్ముపొగడ. 265

సీ. కందుకక్రీడగాఁగదనరంగస్థలిఁ గడు వజీరులమస్తకములఁ దునిమి
హారులనుబోరఁగొని కరులనుదునిమి తదారోహకులఁద్రుంచి పిరంగిటవి
దళనంబుసేసి దుర్భరపతాకలఁగూల్పఁగనుఁగొని కాందిశీకత వహించి
వీఁకఁబట్టినునాస విడిచి నిజాము యేదులఖాను కుతుపశాహులదళంబు
తే. విచ్చ వెన్నిచ్చి కనుకనియిచ్చఁబఱచి, మెచ్చఁజొచ్చిననభయంబునిచ్చి విజయ
కాహళులుమ్రోయనియమించెక్ష్మాజనంబు,లభినుతులొనర్పఁగా వేంకటాద్రిరాజు.

ఉ. ఏలెనుగందవోలుపుర మింద్రసమానుఁడు వేంకటాద్రిభూ
పాలుఁడు ధర్మరీతినరివర్గము బీరముదక్కి మత్తశుం
డాలతురంగహేమఘనసవ్యమణీచయమిచ్చి కేవగల్
ఫాలతరాగ్రసీమఁగరపంకజయుగ్మముఁజేర్చి కొల్వఁగన్. 267

చ. అనిశము గోహిరణ్యవసుధాశ్వతులాదిసమస్తదానముల్
వనరుహనేత్రుఁగూర్చి ద్విజవర్గము రాగిలనిచ్చి రంగమాం
బను మతి కృష్ణమన్దగ వివాహమునై క్రమమొప్ప వారివ
ల్లనుగనె వేంకటాద్రినృపలక్ష్ముఁడు రంగపరామరాజులన్. 268

తే. దర్పితారాతిగర్వవిదారకాతి, చండదోర్దర్వమండితమండలాగ్ర
పాండితిని మించె రామభూపాలుఁడఖిల, రాజసన్నుతులెసఁగ ధరాతలమున. 269

ఉ. సంగరరంగమందు హరిశౌర్యమునన్భువనైకదీప్తుఁడై
రంగపరాజశేఖరుఁడరాతిబలంబులనుక్కడంచె సా
రంగధరుండొ యాపరశురాముఁడొ స్కందుఁడొ రాఘవుండొ యొ
న్నంగనితండటంచును జనమ్ములసన్నుతులుల్లసిల్లఁగన్. 270

మ. ధరణీచక్రము నాల్గుపాదములచే ధర్మంబు వర్తిల్లఁగాఁ
బరిపాలించెను రంగపాధిపుఁడు శుంభద్బాహుగర్వోన్నతి
స్థిరుఁడామేటి మఖంబులన్ద్విజులచేఁజేయింపఁగా దేవభూ
సురసంఘంబతితుష్టిచే సిరులచే శోభిల్లనశ్రాంతమున్. 271

శా. నెమ్మిన్ రంగపరాజశేఖరుఁడు కోనేటమ్మఁదిమ్మమ్మఁ జె
స్వమ్మమ్మువ్వురఁబెండ్లియయ్యెనుబ్రమోదాయత్తుఁడై బంధులో
కమ్ముల్మెచ్చ మహావిభూతినిటులాకాంతామణుల్దాను సౌ
ఖ్యమ్ముంగాంచెను ధర్మతత్పరతనత్యంతంబు వర్తిల్లుచున్. 272

క. అతనికిఁగోనేటమ్మకు, గతకలికల్మషుఁడు విమతఖండనుఁడు గుణా

న్వితుఁడైన వేంకటాద్రి, క్షితిపతి జనియించె నార్యకీర్తన లెసఁగన్. 273

క. ఆరంగనృపాలజఘరి, శ్రీరమణునకుదయమయ్యెఁ దిమ్మాంబాయో
పారత్న మునవల మహో, దారుఁడు గోపాలరాజధన్యుం డెలమిన్. 274

సీ. శ్రీకృష్ణగోపాలసేవావిహారవిచక్షణుండు రుధర్మరక్షణుండు
నందితసకలయాచకరాన్వయమండనుండఖిలారిఖండనుండు
రాజీవపత్త్రేక్షణాజనతాపంచసాయకసుందర్యర్ధదాయకుండు
బాహుబలోగ్రసహాదమహాబలభంజనుండాశ్రితరంజనుండు

తే. సతతసేవకనరవరాంచితకిరీట, ఘటితమణిఘృణిలలితాంఘ్రికమలుఁ డార
ఓటిగోపాలరాజభూవిభుఁడు కంద, నోలు నిజరాజధానిగా నేలె ధరణి. 275

క. చాల వితీర్ణనిఁ గర్ణుని, జోలును దుర్ణయవిరోధిభూపాలకగో
పాలఘటీజనగో, పాలుఁడు గోపాలరాజ పార్థివుఁ డెలమిన్. 276

ఉ. శ్రీలెలమిన్నెలంగఁగ వరించె ముదంబున రంగపేంద్రుగో
పాలనృపాలచంద్రుఁడతివాసని గొబ్బురిగిర్యధారుణీ
పాలునిపుత్త్రి వెంగమను పంకజనేత్ర జితేశ్వరంగిగో
త్త్రాలనామనోహరసుతామణిఁ దిమ్మమునుమ్మహోన్నతిన్. 277

క. ఆపద్మముఖులు దనునను, రూపగుణంబుల భజింప రూఢిగఁ గాంచెన్
గోపాలరాజరాజని, శ్రీపతి సతతంబు సకలసౌఖ్యము లెలమిన్. 278

తే. అనని నిటులస లెఁబుత్త్రపౌత్త్రాభివృద్ధి, రహిని వర్ధిల్లుతిరుమలరాయవేంక
టాద్రిరాజానుజద్వయమధికభక్తిఁ, గొలువ నళిరామభూపాలుఁ డలరు మిగుల.

తే. సలకవిభుతిమ్మరాజుసేనలనుద్రుంచి, గుత్తిఁ బెనుగొండ మఱి గండికోటఁ గంద
నోలుపురమాదవేనవలీల గెలిచి, తొలుదొలుత రామనృపతి దోర్బలము మెఱసె. 280

శా. తారాధీశ్వరగోత్రపాలనచమత్కారుండునై దానవి
స్ఫారోదగ్రతనబ్ధి మించి రిపులన్ దండించి ధాత్రీజనా
ధారప్రక్రియ నొందియింద్రజిపురాధ్యక్షేశుఁడై మించు మా
శ్రీరంగేంద్రునిరామరాజవిభుఁడా శ్రీరాముచందంబునన్. 281

సీ. హరిశౌర్యుఁడగుతిర్మలాధీశ్వరుండునుదదపరజుండగు వేంకటాద్రిరాజు
భుజయుగంబుగ బలస్ఫురణతోఁ గరిహరినరవీరభటులతో దొరలతోడఁ
దనయాజ్ఞ మీఱినకినుక నిజాముపై దండెత్తి తఱిమియుద్దండవృత్తి
నతఁ డేలుచున్నట్టియామదానగరంబు చాలెత్తి మఱియామదాలు వేసి

ఆ. సేతుకాశిమధ్యభూతలనుతజయ, శ్రీవరించి వేడ్కఁ జేఁజెంగె
రామమూర్తియైనరామరాజేంద్రుఁడు, సాంద్రవిభవజితసురేంద్రుఁ డెలమి. 282

సీ. దళితనిజామాదిబలశోణితప్రవాహినులచే జలధి నేఘనుఁడు నించెఁ
గుకురుకోసలమత్స్యకురుకరూశాదిభూపతులచేఁ గానుకలే ప్రభువు గొనియెఁ
దన పేర దేవతాస్థలులనవసరముల్భక్తితో నెప్డు నేపతియొనర్చె
నతిరాత్రపౌండరీకాదియాగమ్ములు సేయించి కీర్తి నేక్షితిపుఁ డందె
తే. నతఁడు కర్ణాటరాజ్యరమాధినాథుఁ, డార్యరక్షావిచక్షణుం డద్రిధైర్యుఁ
డనఘచారిత్రుఁ డఖిలరాజాధిరాజ, రాజపరమేశ్వరుఁడు రామరాజవిభుఁడు. 283

క. నడతయొకింతయు లేదె, క్కడు బహుగండములఁ బొంగుకొనునని గిరులన్
విడిచి సుఖవసతికొఱకై, పుడమిపడఁతి రామరాజుభుజమున నిలిచెన్. 284

శా. రారాజేయభిమానశీలుఁడు సుభద్రానాథుఁ డేధన్వి కం
పారిష్ఫోద్భవుఁ డేసురూపి రవియే యత్యుగ్రతేజుండు మం
దారక్ష్మారుహ మే ప్రదాత విధుఁ డేనందత్కళారాశి మా
శ్రీరంగాధిపురామరాజమహిభృచ్ఛ్రీతాంశు వర్ణించునోన్. 285

ఉ. యామవతీశవంశకలశాంబుధిపూర్ణసుధామయూఖుఁడౌ
రామనృపాలుకీర్తిసరి రానుబెనంగి తొలంగి మూలను
ద్దామతఁ గొండయెక్కి హిమధామనరుండురుభీతి మేనఁదా
సామున నార్యనుంచి మఱి సామునఁ గప్పె మదేభచర్మమున్. 286

చ. ఎలమిని రామరాజవసుధేశప్రతాపమవార్యమై మహిన్
జెలువుగ నిండఁబర్వ శశిశేఖరదివ్యమహాశరాశుగ
జ్వలనశిఖాసముత్కరముచందమునందమునొందెనంతయున్
సలకయతిష్మయప్రముఖశత్రుపురంబులనెల్లనారయన్. 287

## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, సమస్తసద్గుణస్తోమభద్ర, రణరంగరామభద్ర, కల్యాణమహీపాలభాస్వర, కల్యాణపురవరాధీశ్వర, కన్యాకుమారీ భీమరథీ తటాంతనిక్షేపవిజయస్తంభ, స్తోత్రార్హయశఃప్రక్రియాపావనచరిత్ర, ఆత్రేయగోత్రక్షత్రియకులపవిత్ర, మహితకేళికాపారాయణ, మహితచాళుక్యనారాయణ, ధానుష్కచక్రవర్తిబిరుద, చాళుక్యచక్రవర్తిబిరుద, నానావర్ణమండలీకరగండ, దైత్యేభవగండ, హర్తిబ్బరగండ, భాసురభుజాదండ, జయబిరుదరగండ, అసమసాహసగండ,

హొసబిరుదరగండ, గండరగండ, ఘనీకృతమదేభశరజన్యలంపట, త్రిభువన
బిరుదులవెన్నుసమ్మెట, పట్టెసరాయనిజానిష్ట, ఒడయరాయనిశాభట్టశిష్ట, ఐర్గరాయ
ఘనప్రియంకర, అష్టవిగ్రాయమనోభయంకర, విజయచరితసింహాసనాభాస్వర,
విజయనగరసింహాసనాధీశ్వర, యుక్తవర్గసద్యోధనపుర, గుత్తిదుర్గనిర్భేదనపుర,
వాదిపురతర్కాభరణ, ఆదవేనిదుర్గాపహరణ, ఘనచండవర్గబాధక, పెనుగొండ
దుర్గసాధక, మంద్రగిరిదుర్గభాస్వర, చంద్రగిరిదుర్గరాజ్యాధీశ్వర, శబ్దపరిశుద్ధ
సాలక, ఉద్దగిరిరాజ్యపాలక, కాయదుర్గతనయాబంధుర, రాయదుర్గావనధురంధర,
వందనశిలకిరీటపాదక, కందనవోలుకవాటభేదక, చాటూరుఘణితినిర్వాహక, జూ
టూరుసమరనిర్వాహక, చండనపాటిఖడ్గసాయక, కొండవీటిదుర్గనాయక, పుట్టప
ల్లిసీమాధిష్ఠితధామసాగర, రెట్టహళ్లిసీమాప్రతిష్ఠితధామసాగర, వంకాదిమవీరసమా
సంగిత, బంకాపురవీరరమాలింగిత, సాంద్రకీర్తినిరంతర,చంద్రగుప్తిధరాంతర,ఆచా
రరాజ్యావయవచర్య, రాచూరురాజ్యహరణధుర్య, మదచండవర్గాదిదాయక, ముదు
గంటిదుర్గాధినాయక, పరిభల్లుచరణభూషణ, ఓరుగల్లునగరపోషణ, విజయకరాయ
తసాయక, విజయాపురభయదాయక, ఐర్ణనాదికరక్షోపకార, సొల్లలాపురసంక్షోభ
కార, కల్యాదినృపకబాధక, కల్యాణనగరసాధక, సామదానముఖ్యశీలరంజన, ఆ
మదానగరసాలభంజన, ధావకరమార్గవిక్రాంతిసార, దేవగిరిదుర్గ సమాక్రాంతిధీర,
గౌతమీస్నానపావనాకార, కౌతుకాఖిలభూజనాధార, బలిచాపలిజన్యదాయక,
హాలిపురచాంచల్యకారక, ఘడితకూటతమసింహసంహనన, బెడదకోటనగరసింహ
సంహనన, బలికిరికూటపాకలశౌర్య, కలుబరిగికోటపాటనధుర్య, నగరసమాక్రమ
ణవిచార, సగరసమాక్రమణధీర, పరచండనిర్గతకింకర, పరచండదుర్గభయంకర,
సంసదుర్గ కేతుహరణ, హంసదుర్గనిబర్హణ, స్వర్ణాటకవర్గసద్గ్రంథనాసిక, కర్ణాటక
బుధఘన్యాసిక, జుర్నారభయనిర్ణాయక, నిర్నారుసామజసముద్రద్రునిష్ఠాధిదా
యక, సామగిరిదాపక, రామగిరిదుర్గప్రతిష్ఠాపక, మేదినీతలసమగ్రసంపాదన,
యాదగిరిదుర్గభేదన, శీలచండమృదుభాషణ, గోలకొండపురదూషణ, అయలకొండ
చండవిమతహాలాహల, అయిలకొండహరణకౌతూహల, సానుభల్లుధృతిపరాక్రమ,
సానుగల్లుకృతిపరాక్రమ, పానుగంటిదుర్గపాటనధుర్య, భూనుతసాహసధుర్య,
నెల్లితచండమల్లభ, బెల్లముకొండవల్లభ, నిలయలోలగర్జితాకార, మలయకేళిమహి
మాధార, కామసమాచరణాక్రమణ, సోమపదమానచణాక్రమణ, శావగదుర్గబా
ధక, మాపురదుర్గమాధక, ఖండితసమగ్రసంధాచణ, దండితసమస్తశత్రుగణ,
అక్షౌరూఘరక్షానికర, మక్షాకోటదక్షానికర, మక్షాకోటశిక్షానికర, అక్షౌరూఘశి
క్షానికర, ఉల్లీఘనిజాప్తకల్లోలజాలక, ఢిల్లీపురహల్లకల్లోలహాలిక, కేలీసుమందారు

గతబృందాయక, గోతేయసందేహాభయసందాయక, కఱంబవర్గసంభాసుర, కఱంబ
దుర్గకంపాసుర, భూగోళరుచిరభూషణ, పైగోవనగరభీషణ, కొండపల్లిహరణ,
చండకరనిభప్రతాపభరణ, వినుకొండపాలక, వినూత్నకృతనాగార్జునుని కొండ
సాలజాలక, అనంతికలితపూరణ, అనంతిమదవిదారణ, కటకరాజ్యాధివర్తన, కట
కరాజ్యఘటితకీర్తన, అజికరేంద్రదారుణశరాసన, రాజమహేంద్రరాజధనుశ్శా
సన, బూదలఖానుతిక్తాంగహరణ, యేదులఖానుసప్తాంగహరణ, నిదానమలకగుణ
సహజాపగాధిచారక, నిదానమలకభుజాబలాపహారక, రమాధిపవినుతాపదానకీర్తన,
ఇమాదనమలకమానమర్దన, ఘృతరిపుదళనబంధుర, కుతపనమల్కదళసింధుర, కరీ
శతరుణాకారీశసుగుణాభరణ, బకీదుబలహరణ, భుజకృతరిపుధావనావధాన, గజ
పతివినుతపరాక్రమాసిధాన, కలికర్కశసమగ్రస్తంభీకృతారాతివర్గవిశాల, కలివర్గ
మననిర్గపరతర్కవారాశివర్గకేళి, గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గ చతురశీతిదుర్గ
సమస్తదళవిభాళ, రిపురాజగోపికాగోపాల, గాయగోవాళ, శ్రీరంగరాజరామ
భూపాల, విజయీభవ, దిగ్విజయీభవ. 288

తే. అని హిమాచలసేతుపర్యంతధరణి, పతులసభలందు సత్కవుల్ ప్రణుతిసేయ
వెలసె నెంతయు నార్వీటికులపయోధి, చంద్రుఁడైనట్టిరామరాట్టనవిభుండు. 289

తే. అనఘుఁడౌ వైరసేని భీమాధిపేంద్రు, పట్టి దమయంతిచేపట్టినట్టికీర్తి
రామభూపాలకుఁడు కృష్ణరాయతనయ, యగుతిరుమలాంబనుద్వాహమయ్యె వేడ్క.

చ. శతమఖునింబులోమజను శంకరునిన్గిరిపుత్రి శంబరా
హితు రతిదేవిఁబోలుచునహీనసుఖానుభవాప్తి రామభూ
పతియును దిర్మలాంబయును భానుసమానునిఁగృష్ణపాధ్యునం
చితగుణుఁబెద్దతిమ్మనృపశేఖరుఁగాంచిరి హర్ష మొప్పఁగన్. 291

సీ. మఱియును నారామమానవాధీశుండు జిల్లెళ్లకులసుధాసింధుచంద్రుఁ
డగు పెద్దనందిరాజాగ్రణిసుతనప్పలాంబనుబోచిరాజాన్వయావ
తంసముఁదిమ్మభూధవుప్రియాత్మజఁగొండమ్మలక్ష్మమ్మయుననఁగఁబరఁగు
సరసిజవదనల వరుసతో నిరువురనతివైభవోన్నతులతిశయిల్ల

తే. సతులనిటుమువ్వురను బంధువితతివొగడఁ, బరిణయంబయ్యె సంభ్రమభరితుఁడగుచు
నబ్జగర్భగురుండు పీతాంబరుండు, శ్రీమహీనీళల మును పరించినట్లు. 292

క. ఆతతధర్మపరతనా, శాతోదరులందు రామజనపాలుఁడు వి
ఖ్యాతిగ దక్షిణనాయక, రీతి మెలఁగి వినుతిఁదా ధరిత్రినిఁగాంచెన్. 293

తే. ఆయదూర్వహుదేవులయందు మిగులఁ, గాంతునను రక్తిఁ గను భోజకన్యపగిది
రామభూపాలుసతులలో రమణమన్న, నలను లక్ష్మాంబ మిక్కిలియలరుచుండు.

శా. ఆరామక్షితిభర్తఁ గాంచెను బ్రమోదాయత్తుఁడై కొండమాం
బారామామణి బెల్లఁ గొండధరణీపాలేంద్రు సద్వర్తనుం
డౌ రాచూరిపురీశుఁ దిమ్మవిభు లక్ష్మాంబాపయోజాస్యయం
దారూఢాత్ము సిరంగరాజవసుధాధ్యక్షు న్దయాబ్జాత్మునిన్. 295

తే. ఈవిధంబునఁ దిరుమలదేవి కొండ, మాంబ లక్ష్మమ్మయను దేవులందు రామ
ధరణిపతి గాంచె సుతుల నేవురను వార, లలరిరీశునిపంచాస్యములను బోలి. 296

క. వితరణరేఖను రాధా, సుతుఁ డంచితభోగగరిమ సుత్రాముఁ డనన్
నుతిఁ గాంచెఁ గృష్ణరాయ, క్షితిపరుదౌహిత్రుఁడైన కృష్ణేంద్రుఁ డిలన్ 297

క. కృష్ణమహీపతి రెండవ, కృష్ణుఁడు విమతబలహననకీర్తిని సాక్షా
త్కృష్ణుఁడు సతోషణాన, తృష్ణకిరణసదృశుఁ డెన్న నురుతేజమునన్. 298

మ. హరిశౌర్యుండగు రామరాజవిభుకృష్ణాధీశుసత్కీర్తియా
సురనాథేభము చెంపఁ గొట్టి జలజస్తోమంబులం గట్టి భా
సురముక్తామణికాంతిఁ దట్టి తుహినక్షోణీధ్రము న్మెట్టి తా
నురిఁ బొమ్మంచను బొమ్మఁ బెట్టుఁ గరఁచున్నక్షీశ్వరశ్రేష్ఠులన్. 299

ఉ. ధ్యేయుఁడు రామరాజ పెదతిమ్మవిభుండని వాజిఁ దోలి లోఁ
బాయనిభీతిచేత మొన భగ్నము గా యవనుల్ద్రోలంగ నా
చాయ నిజాముఁ డడ్డపడ సామజయూథముఁ ద్రుంచెఁ జూపరుల్
వాయుజుఁ డంచు నెంచఁగ నవార్యసముజ్జ్వలబాహుశౌర్యుఁడై. 300

క. పెదతిమ్మనృపతి మఱియును, మదకరిహరివీరభటసమాజముతోడన్
గదనమునఁ గదియుతురకల, సదమదముగఁ జునిమె బాహుసంరంభమునన్. 301

ఉ. రాయకులీనుఁడైన యళిరామనృపాలుని పెద్దతిమ్మభూ
నాయకమౌళి యిచ్చు దిననాథతనూభవుమాడ్కి నర్థికిన్
ద్రోయక కోరుకోరికలు తూర్ణముగాఁ గడుఁ గీర్తిచంద్రికల్
దోయజసంభవాండమునఁ దోరములై కనుపట్టుచుండఁగన్. 302

ఉ. మావులు నేనుఁగుల్భటసమాజము పీనుఁగుపెంటగాఁగ గం
గావలినుండి కృష్ణదనుకానొనరించి నిజాముఁ దోలి రా
మావనినాథుఁ గొండవిభుఁ డాహవకేళిఁ జరించెఁ జూచియా
దేవతలెల్ల నీఘనుఁడు దేవవరాత్మజుఁ డంచు నెంచఁగన్. 303

ఉ. సారదయా విశిష్టగుణసన్నుతరామనృపాలుకొండభూ
శ్రీరమణోగ్రఖడ్గహతిఁ ద్రెళ్లి తురుష్కవిభుల్ చరింతురి
చ్చారతినొక్కతొక్క తెవశంబు పసైదుగురట్లు దేవతా
చారుమృగీవిలోచనలసంగతి నైజగుణంబె యౌఁగదా. 304

ఉ. ఏలుచునా పెనుగొండిపురమింద్రసమానుఁడు కొండధారుణీ
పాలుఁడు పొల్చె శాత్రవులు బంటుతనంబుఁ మాని చావడిన్
వేళయెఱింగి కాంచి మఱి వేళమునన్ మకుటాగ్రరత్నరు
గ్జాలముచేత నాత్మపదకంజయుగంబు నలంకరింపఁగన్. 305

క. సూరపవాహాధీశ్వరు, కూరిమిసుతఁ దిరుమలాంబఁ గులసతిగ మహో
దారత వరించె రాము, క్ష్మారమణుని కొండనృపతి కడు వేడుకతోన్. 306

క. ఆమహితాత్మునితనయుఁడు, రామాధిపుఁ డహితకమలరాకాశశియై
భూమిఁ బ్రజలెప్పుడునధిక, శ్రీమించఁగ నేలె నీతి చెలువు దలిర్పన్. 307

క. హరిభక్తిపరుఁడు సుగుణా, కరుఁడంచితదానవిజితకర్ణుఁడు రజనీ
కరకులుఁడు కొండధాత్రీ, శ్వరరామనృపాలుఁడిలను జననుతినంగన్. 308

సీ. గొబ్బూరికులవార్ధికుముదాప్తుఁడౌ నోబవిశ్వంభరాధీశవిభునికూర్మి
తనయయౌ నరసింగమను సూరపాన్వయపావనుండగు నోబపార్థివేంద్రు
పుత్రి నోబమ్మను బోచిరాట్చన్ననృపాఖ్యునిసుత జానకమ్మ నిట్లు
వరుసతో ముగ్వురఁ బరిణయంబై వారలనిశంబు ననురక్తి నాత్మధర్మ
తే. వర్తనకును సహాయులై వర్తిలంగ, నఖిలతరభోగభాగ్యంబు లాసతీత్ర
యంబుతోఁ గూడఁ దాఁ జాలననుభవించె, రామభూవరుకొండ్రాజు రామరాజు. 3..9

క. రాచూరితిమ్మవిభుఁడు క, రాచూరిని రిపులఁ దునుమ రంజిలు శుభసం
సూచకములు దోడ్తోడ సు, కీచయమునకును బ్రమోదవృద్ధి దలిర్పన్. 310

ఉ. నారద వింటె చిత్రమిది నాకవాసులు గాక దేవతా
వారిజగంధులం గలసి వత్తురు నన్గొలువంగ ధేనుసం
హారులు మ్లేచ్ఛులన్న వినుమా సురవల్లభ యాజిభూమి రా
చూరిపురీశు తిమ్మవిభునుగ్రకరాసిని మ్రగ్గఁ గాఁజుమీ. 311

చ. అన సురలెల్ల సంశయమె యబ్జజసంభవుమాట తథ్యమా
ఘనుకరవాలచిత్రగతిఁ గంటిమి గాదె నిజాముసేనలన్

దుని మెడివేళ నాశ్వికునితోఁ దురగంబును మావటీనితో
డనుగరి ఖడ్గయుక్తము భటప్రకరంబును డొల్ల వాసవా. 312

చ. అనఘుఁడు రామభూవరుప్రియాత్మజుఁడాచినతిమ్మమాన వేం
ద్రుని పటుశౌర్యమాశశివిరోచనభూధరతారకంబుగా
దినదినముం బ్రియంబునను దీవనలిచ్చిరియెల్ల దేవతల్
ఘనముగఁ బూలవాన జడిగాఁ గురియించిరియాడిరచ్చరల్. 313

ఉ. భూరిపరాక్రమోజ్జ్వలుఁడు పుణ్యచరిత్రుఁడు రామరాజు రా
చూరిపురీశుతిమ్మనృపసోముని నిర్మలచారుకీర్తితో
సారెకు సాటిరాఁ బెనఁగి చాలక కావె జడల్ధరించి గౌ
రీరమణుండుఁ గప్పెను ధరిత్రియు నుంగఁగ వ్యాఘ్రచర్మముౝ. 314

క. రాచూరితిమ్మరాజధ,రాచక్రేశ్వరుఁడు పాణెరాజుప్రియసుతా
పోచమదేవిని మోద, ప్రాచుర్యము మదిఁ దలిర్పఁ బరిణయమయ్యెౝ. 315

క. వీరాగ్రణి శ్రీరంగధ,రారమణుఁడు నదుల సాగరము లోఁగొనున
ట్లారూఢి రిపులఁ బొరిగొని, వారలసంపదలఁ గొనియె వాఙ్నివేద్యౝ. 316

చ. అతిశయదానలోలుఁడు మహామహుఁడాశ్రితవజ్రపంజరుం
డతులితధర్మమార్గుఁ డభియాతిభయంకరమూర్తియార్యస
మ్మతమతి రామభూవరకుమారకుఁడై నసిరంగరాజుతో
క్షితివరులెవ్వరీడతనికిన్మతి సాటియతండెయౌ మహిౝ. 317

శా. దక్షుధ్వంసియు రామరాజమనుజాధ్యక్షేశు శ్రీరంగరా
జక్షోణీంద్రుఁడునొక్కరూపరయనీసర్వంసహానాథుసం
రక్షౝ శత్రుపురీహరత్వమున శౌర్యస్ఫూర్తినట్లయ్యు య
జ్ఞక్షోభోగ్రుఁడతండితండు మధురక్ష్మాదక్షుఁ డీక్షింపఁగౝ. 318

మ. పరమప్రీతి వినమ్రులై సకలభూపాలుర్దనుం గొల్వఁగాఁ
గరుణాంభోనిధి రామభూవరుసిరంగక్ష్మాతలాధీశుఁడు
ర్వరఁ బాలించె భగీరథున్సగరునౝ రాముం ద్రిశంకూద్భవుౝ
బురుకుత్సున్నయునంబరీషు భరతుౝ బూరున్నలుం బోలుచుౝ. 319

మ. అళిరామేంద్రసిరంగరాయమనుజాధ్యక్షేశుసత్కీర్తి ని
ర్మలకాంతుల్నిబిడంబుగాఁ గలయఁ బర్వం జూడఁ జెన్నొందెనీ

జలజాతప్రభవాండభాండము మహాశ్చర్యంబు సంధిల్లఁగాఁ
బొలుపొందంగ వివర్ణనీయమయి కర్పూరంపుబొట్టోయనన్. 320

తే. బాహుబలభీమ సంగ్రామపరశురామ, రామభూవరశ్రీరంగరాయవిభుని
భూరితేజోఽరుణద్యుతి భువనమలరెఁ, బుష్పితాశోకభూరుహస్ఫూర్తిఁ దనరి.

చ. కడిమిఁ గిరీటిమాడ్కి నతిఁ గన్న సిరంగమహీవిభుండు మే
ల్పడకలపోచిరాజరఘునాథనృపాలునికూర్మిపుత్రికన్
బుడమిపడంతిదాల్మి ననఁ బోలినలక్ష్మమనున్ వరించె నిం
పడరఁగ రాఘవుండు జనకాత్మజఁ గైకొనుచంద మేర్పడన్. 322

సీ. అనవరతాభ్యుదయాభిలాషాశ్రితప్రతతికి ముంగొంగుపసిఁడియనఁగ
వినుతవిద్వత్కవివిసరంబులకు గృహస్థితయైనయా కామధేనువనఁగ
వంశానుగుణ్యప్రవర్తనలౌ బంధువితతిపాలిటి కల్పలతిక యనఁగ
సరసాన్నదానదీక్షామహానిపుణత్వమునను రెండవయన్నపూర్ణ యనఁగఁ

తే. జతురుదధివేష్టితావనీచక్రమునను, గలుగుసర్వసర్వంసహాతలవరేణ్య
కామినీజనసన్నుతుల్గాంచి మిగులఁ, దేజరిల్లి నలక్ష్మమ్మదేవివలన. 323

క. అతిగుణనిధి శ్రీరంగ, క్షితిపతికుదయించి రార్యకీర్తితసుగుణా
న్వితులు సుతులు పెదవేంకట, పతి చినవేంకటపతియనఁ బరఁగ నిరువురున్. 324

మ. అరిభూపాలకులాజి నిక్కముగ జాయార్థంబు సక్రోధుఁడై
శరధిం గట్టి కపర్ది నాఁగఁ బురముల్ శౌర్యోన్నతిన్ వ్రాంచు దా
శరథిం గా మది నెంచి కాన్కలిడి యాజ్ఞావర్తులై కొల్తురా
కరుణాంభోనిధిఁ బెద్దవేంకటపతిక్ష్మాపాలు నెల్లప్పుడున్. 325

శా. శ్రీరంగాధిపుపెద్దవేంకటధరిత్రీజాని యుద్యద్భుజా
సారంబొప్పఁగ నేలె నెంతయు నుగృష్ణా సేతుమధ్యక్షితిన్
దూరీభూతవిపత్సమానవవరస్తోమప్రచారంబుగా
నారూఢిన్ ధరణీజనుల్ సకలసౌఖ్యావాప్తి రాణింపఁగన్. 326

సీ. వనజనివాసానివాసకృపారసాసారాలవాలవీక్షణము చేత
శరసుధామందారశరదభ్రడిండీరధవళసత్కీర్తిసంతతుల చేత
నలజయంతవసంతనలకూబరనితాంతవరరూపకలితవిస్ఫురణ చేత
రణరంగచండదోర్బలదుర్జయాహితగణగర్వహరణవిక్రమము చేతఁ

తే. బుండరీకాక్షుఁ దద్భాగ్నితఁ బుత్రమిత్రుఁ, దెగడి ప్రహసించి యుడికించి ధిక్కరించి

మించెనెంతయు శ్రీరంగమేదినీశు, పెద్దవేంకటపతిరాయభిదురపాణి. 327

క. గొబ్బూరివంశమణి హ, న్నిబ్బరగండఁడగునోబనృపవరుసుతయౌ
నబ్బంగారమ్మను మది, నుబ్బుచుఁబెదవేంకటపతియొనర వరించెన్. 328

క. అతనిసహోదరుఁడబ్జా, హితకులకలశాబ్ధిపూర్ణహిమరుచి బుధస
మ్మతమతియౌచినవేంకట, పతిగుణతతి నుతికలవియె ఫణిపతికైనన్. 329

తే. భక్తజనమందిరాంగణపారిజాత, మైనశ్రీవేంకటాచలాధ్యక్షుపగిది
భవ్యసాత్త్వికగుణగణభాజియగుచుఁ, జిన్నవేంకటపతిరాజసింహుఁడలరు. 330

సీ. పెనుబాఁపకవణంబుఁదినువారువముకౌతుకట్టినోయగముతోఁ బరఁగువాఁడు
కలిమిచూపుమిటారికత్తియతోఁబుట్టుపసమించురంగుతో నెసఁగువాఁడు
తపసిరాకన్నాఁపదాలుపుచెలికానిదళమైనయీవితోఁ దనరువాఁడు
తాటిటెక్కెమువానితల్లినెయ్యపుఁబట్టి మించుబీరంబుతో మెఱయువాఁడు
తే. రాజమాత్రుండె శ్రీరంగరాజుచిన్న, వేంకటపతీశుఁడఖిలపృథ్వీవరేంద్ర
మకుటమణిఘృణిసువిరాజమానపాద, పద్ముఁడాశ్రితజనపద్మభాస్కరుండు. 331

సీ. మొగమియ్యకనుబరాఙ్ముఖుఁడైనఁగదియఁబోకనుజిరాయువుగల్గఁగానొనర్చుఁ
గని కరమ్ములు మోడ్చఁగనికరమ్మునఁబ్రోచి ముదముతో సకలసంపదలఁగూర్చుఁ
గలసియుండకనుజపలమతి నాగవాసముఁజేర నిజపథూజనులఁజేర్చు
నెదురుగా రాఁగ్రచ్చిరెత్తి వేగమె వేల్పుపొలఁతులపాలిండ్లఁబొందఁదార్చు
తే. నతులవీరప్రతాపరాజాధిరాజ, రాజపరమేశబిరుదవిరాజమానుఁ
డైనచినవేంకటేంద్రుబాహాసిపుత్రి, చిత్రమిదియని బుధులు చర్చింతురెపుడు.

సీ. ఒకనాఁడు చినవేంకటోర్వీశ్వరుఁడు విరూపాక్షుసేవాసక్తినచ్చటికిని
నరిగి క్రమ్మఱఁద్రోవయందొక్కయెడ రామసుత్రాముఁడునుబొడచూపినట్లు
తోఁచిన భయము సంతోషంబుఁబెనఁగొనఁబ్రకటరోమాంచకంచుకితగాత్రుఁ
డై వచ్చి నెమ్మది హరిఁదల్చి నిద్రింప డంబైనమణికిరీటంబుఁదాల్చి
ఆ. దివ్యభూషణములు దివ్యమాల్యంబులు, దివ్యగంధములును దివ్యవస్త్ర
ములునుదాల్చి దివ్యమూర్తితోఁగోదండ, పాణియైనరామభద్రుఁడెదుట. 333

క. వచ్చుటు నిల్చినఁగనుఁగొని, యచ్చెరువీరాజిచటికి నరుదెంచుటయే
మిచ్చనుదలఁచుకనోయది, యొచ్చెముపడనీక దానినొనఁగూర్పఁదగున్. 334

సీ. అనుచునుదంపపోయునంతనోచినవేంకటాధిప నీవు పంపాధినాథుఁ
డగునీశు భజియించియరుదేరఁద్రోవనుబొడసూపినట్టి యాభూమిభుజుఁడ

నేను నాపేరు నీకెఱింగింతుఁ గోదండపాణియౌ శ్రీరామభద్రుఁ డండ్రు
మమ్ము భూజనులన్నమాట విన్నంతన నిటలతటాగ్రసంఘటితహస్త
తే. కమలుఁడై దండములఁ బెట్టి కనకపీఠ, మందు నాసీనుఁ గాఁ జేసి యాగమోక్త
సరణిఁ బూజించి తత్పాదజలజములకు, భక్తిఁ బ్రణమిల్లి యిట్లని ప్రణుతిఁ జేసె 335

## చక్రబంధము.

శా. భవ్యా కోసలసూతినందన రమాభావేందుసారంగకా
క్రవ్యాదప్రహరప్రవీణ నయరక్షాగణ్యనామాంకితా
దివ్యాండప్రచయప్రభావనరథా దీనస్పృహాకంటకా
కావ్యారంభహితక్రమా విదితనాకాకీ శ్రితానందకా. 336

## నాగబంధము.

చ. పరమదయాకరా రవిజభంజన బోధవిహారభాసురా
కరధృతచాప నీరజజకంజసురప్రకరాశనాంబుజా
మరధరణీజహారశరమారవిపక్షపయోదసారకీ
ర్తిరమశతావిహార ధరధీర వసువ్రజఘాతిపావకా. 337

## గోమూత్రికాబంధము.

క. మురహర ధృతగిరివర పర, వరద రమాధీశ గోప వర్ణితచరణా
దరధర నుత కరివర సుర, వరద రసాధీన గోప వందితచరణా. 338

## చతుశ్చరణగర్భకందము.

గిరిధర కమలాధ్యక్షా, సరసీరుహపత్రనయన శరనిధిశయనా
మురహర సన్నుతనామా, కరుణాకర నరసఖ హరి కరివరరక్షా. 339
1. శరనిధిశయనా మురహర, సరసీరుహపత్రనయన సన్నుతనామా
కరివరరక్షా గిరిధర, కరుణాకర నరసఖ హరి కమలాధ్యక్షా. 340
2. శరనిధిశయనా గిరిధర, సరసీరుహపత్రనయన సన్నుతనామా
కరివరరక్షా కరుణా, కర నరసఖ హరి మురహర కమలాధ్యక్షా. 341

## ద్వికందగర్భక్రౌంచపదవృత్తము.

ధారుణిపారావారసుతారత్నములిరుగడల సతతమును బాదాం
భోరుహసేవల్గోరిమిఁ బూరంబుగ నెదలనునిచి పొలుపుగఁ జేయన్
జేరి సురల్గైవారముచే రంజిలునటులొనరిచి చెలఁగఁగ నుండే
వారిదవర్ణున్ శౌరిని వైరివ్రజదమను జగదవనునిని గొల్తున్. 342

క. ధారుణిపారావారసు, తారత్నములిరుగడల సతతమును బాదాం
భోరుహసేవల్గోరిమిఁ, బూరంబుగ నెదలనునిచి పొలుపుగఁ జేయన్. 343

క. చేరి సురగ్రైవారము, చే రంజిలునటులొనరిచి చెలఁగఁగనుండే
వారిదవర్ణున్ శౌరిని, వైరివ్రజదమను జగదవనునినిగొల్తున్. 344

## నవగ్రహాష్టదిక్పాలకదశావతారనామగర్భకందము.

హరి శశి కుజ బుధ గురు కవి, హరిసుత తమకేతు హరియమాస్త్రపకధనే
శ్వరశంకర శరచరయుగ, కిరి నరహరి వటు త్రిరామ కితవ ముఖహాయా. 345

## ద ం డ క ము.

శ్రీజానకీనిస్తులోరోజ కాశ్మీరకస్తూరికాగంధపంకాంకితోరస్థ్సలా, నిర్జరారాతి సంశాటవీదాహదావానలా, కోటిసూర్యప్రకాశా, త్రిలోకేశ, విశ్వస్వరూపా, శుభాలాప, గోరాజహంసాభ్రమాతంగవాహాదిగీర్వాణసందోహకోటీరకోటిస్ఫుటానర్ఘ్యరత్నప్రభాకీర్ణపాదారవిందా, సునాభీసరోజాతగర్భార్భకాకారరాజచ్ఛతానంద, గౌరీశవాగీశనాకేశభోగీశులైనన్ భవద్దివ్యచారిత్రముల్సన్నుతుల్సేయఁగాఁ జాలరే నెంతవాఁడన్ మహామూఢచిత్తుండ మత్తుండనైనన్ భవత్కృత్యముల్సన్నుతుల్సేసెదం జిత్తమందుంచి రక్షింపవే, దేవ, మీనాకృతిం దాల్చి, సుప్తాబ్జసంజాత నిశ్వాసవేదాపహర్తాసురారాతి మర్దించి యాబ్రహ్మకున్వేదముల్గ్రమ్మఱం జేర్పవే, కచ్ఛపాకారముం బూని పాథోధినిర్మగ్నమంథాచలేంద్రంబు వెన్నాఁగి దూర్వాసశాపాహతాఖండలశ్రీపునర్లాభముం జేయవే, ఘృష్టిరూపంబుచేఁ జండబాహాబలోదగ్రహేమాక్షరక్షఃపతిం ద్రుంచి పాథోనిమజ్జద్రసాకాంతనత్యంతసంతోషితస్వాంతగాఁ జేసి శృంగాగ్రభాగంబునన్నిల్పవే, మర్త్యసింహుండవై స్తంభమం దుద్భవంబంది సాయంసమారంభకాలంబునందూరుయుగ్మస్థలాసాదితాదిత్యవిద్వేషిరాట్కుక్షివిచ్ఛేదనోత్సాహముం జూపి నీబంటుపంతంబుఁ జెల్లింపవే, గుజ్జుపాఱుండవై నిర్జితామర్త్యనాథప్రకర్షానుమోదాత్తుఁడైనట్టివైరోచనిన్మెట్టి జీర్ణేంద్రరాజ్యప్రతిష్ఠాపనాచార్యవిఖ్యాతినిం జెందవే, రేణుకాగర్భపేటీలసద్రత్నరామావతారంబుచే సాపరాధాతిశౌర్యోగ్రరాజత్సహస్రోరుదోర్ముఖ్యరాజన్య సందోహముం జెండి సర్వంసహాచక్రమాద్యంతముం గశ్యపబ్రహ్మకుం దానరూపంబుగా నీయవే, రామభద్రాఖ్యచే గాధిపుత్రుండు గావించుయాగావనార్థంబు వేంచేసి యాతాటకానామచోపాచరిం బుత్రయుక్తంబుగాఁ ద్రుంచి మారీచుని న్వారిధి న్ముంచి పాషాణరూపంబుచేనున్న మౌనీంద్రుయోషాలలామంబు దోషంబులెల్లన్ని

మేషంబులో నంఘ్రిరేణుప్రభావంబుచేతం దొలంగించి చంచద్గుణోపేతకై లోకవిఖ్యాతకై విస్ఫురద్భాగ్యసంభూతకై సీతకై దర్పకారాతికోదండదండంబు వేదండ మంభోజకాండంబు ఖండించుచందంబునం దుంచి భూపుత్రినిన్వేడ్కతోఁ బెండ్లియై చాల దోశ్చండగర్వాతిరేకోన్నతిన్మించు నాజామదగ్న్యున్నివారించి యాకేకయేశాత్మజామోదమానస్థుగాఁ దండ్రిసత్యంబుఁ బాలించి రాజ్యాభిలాషంబుఁజాలించి ఘోరాపరాధున్విరాధుంబడంగూల్చి నానామృగాకీర్ణమా దండకారణ్యభూమిం బ్రవేశించి మాసింద్రవిద్వేషణుందూషణుం ద్రుంచి మాయాకురంగాకృతాసీచు మారీచు ఖండించి పాదోరుసంఘుట్టనక్షుణ్ణనానావిధగ్రావు సుగ్రీవునింబంటుగా నేలి సంగ్రామరంగస్థలీజృంభణోద్యద్భుజాశాలి నావాలినొక్కమ్మునంగూలఁగా నేసి బాణాగ్నికీలంబయోరాశినింకించి భాస్వద్యశోహేతువౌ సేతువుంగట్టి నిశ్శంక లంకాపురింజుట్టి మాయావులున్యుద్ధచాతుర్యసంపన్నులు న్సర్వదుర్వారులున్ దేవతావ్రాతసంహారులు న్సైన్యనాయాసంకర్ణాదిరాత్రించరాధీశులం ద్రుంచి యాఖండలస్యందనం బెక్కి దుర్వారగర్వోన్నతిన్ లోకవిద్రావణున్ రావణున్ గూల్చి లంకాపురాధీశుఁగాఁ గుంభకర్ణానుజుం బట్టముంగట్టి వైశ్వానరాభీలకీలాప్రవేశక్రియాత్యంతశుద్ధాత్మయైనట్టి ధాత్రీసుతన్వేడ్కఁజేపట్టి రాత్రించరుల్వానరుల్గొల్వఁగాఁ బుష్పకంబెక్కి యక్కైకయీనందనాలంకృతంబౌనయోధ్యాపురంబుం బ్రవేశించి కౌసల్యకుం గైకకున్ శ్రీసుమిత్రామహాదేవికిన్ భక్తితో దండముల్వెట్టి మిత్రానుజాచార్యసామంతమంత్రిక్షమానాయకుల్సంతసంబందఁబట్టాభిషిక్తుండవై సీతతోఁగూడ సౌభాగ్యభోగాభివృద్ధిం బ్రవర్ధిల్లవే, రోహిణీపుత్రరామస్వరూపంబుచే లాంగలోద్ధూతనాగాధిభూపట్టణాకారరేఖన్విజృంభించి భీతాత్ముఁడౌకౌరవేంద్రుం గృపం బ్రోవవే, బుద్ధభావంబుచే నాసురీమానభంగంబుఁగావించి పాలాక్షునింద్రాదిబృందారకానీకసంస్తుత్యశశ్వజ్జయశ్రీ వరింపన్నియోగింపవే, కల్కివై ధర్మమార్గేతరోర్వీజనవ్రాతముం ద్రుంచియుత్పన్నవర్ణాశ్రమాచారసద్వర్తనోద్ధారకత్వంబునం బొల్చునాహ్లాదభావాప్రమేయుండవౌనట్టిదేవుండవున్నీవకావే, త్రిలోకంబులన్ లీలఁబుట్టింప రక్షింప సంహారముం జేయఁగాఁజాలియున్నట్టి మూర్తిత్రయాకారసంభూతిహేతు స్వయంవ్యక్తమాయాపరబ్రహ్మము న్నీవకావే, భుజంగేంద్రతల్పా, ప్రపన్నాఖిలాపద్వరానల్పకల్పా, భవద్భక్తి నాకుం బ్రసాదించి రక్షింపవే, భానువంశాబ్ధిరాకాసుధాధామ, దైత్యేంద్రహృద్భీమ, నీలాంబుదశ్యామ, కోదండరామా, నమస్తే నమస్తే నమస్తే నమః. 346

తే. అనుచు వినుతింపనారాముఁడనియెఁ జిన్న, వేంకటపతిక్షమానాథ వినుము నీదు
పుత్త్రుఁడగువీరవేంకటభూవరునకు, నగ్రసుతుఁ డుద్భవిల్లు మదంశమునను. 347

క. అనియానతిచ్చి రాముఁడు, గనుఁగొననంతర్హితుండుగా మేల్కనియా
చినవేంకటపతి బాంధవ, జనములకావిధముఁ దెలిపి సంతోషమునన్. 348

క. చినవేంకటపతినృపమణి, కనకప్రాకారముఖ్యకైంకర్యంబుల్
జను లెన్నఁగ మోదంబొ, ప్పనొనర్చి భజించె రామభద్రస్వామిన్. 349

ఉ. ఈమహిఁ జిన్నవేంకటపతీశ్వరుఁ డర్థులఁ జెందఁ జేయు ము
క్తామితహారవాహమదహస్తి సువర్ణముఖోరుసంపదల్
ప్రేమను శత్రుకోటికిని భీషణరేఖనుగల్గఁ జేయు ము
క్తామితహారవాహమదహస్తిసువర్ణముఖోరుసంపదల్. 350

సీ. ఏధన్యునిజధామమిందిరాకాంతకు మానితకేళికామందిరంబు
ఏఘనుభుజపీఠమీమహీకామోదకరరమణీయసౌఖ్యప్రదంబు
ఏభూభుజునిజిహ్వ యాభారతికి నెప్డుఁ గమనీయనృత్తరంగస్థలంబు
ఏకాంతుకరుణావిలోకనం బాశ్రితగురుజనములకు ముంగొంగుపసిఁడి
తే. యతఁడు సామాన్యుఁడే సగరాంబరీష, భరతనలరంతిహైహయప్రముఖపూర్వ
రాజచర్యుండు శ్రీరంగరాజచంద్రు, చిన్నవేంకటపతినృపశేఖరుండు. 351

సీ. జంటమొగంబులసామిముద్దులకుఱ్ఱతల్లిగేస్తుఁడు సిగఁదాల్చుపువ్వు
వడిగలజింకతత్తడినెక్కునెఱరౌతుపొరుగూరిదొరకును బొరుగుఱేని
నిరునాలుమేనులనెసఁగువేలుపుతండ్రిపట్టిపట్టపుఁజలుపంజమెకముఁ
దనబిడ్డనుజూప్రలనుగాచుకొనుడాలుగలమేటితల్లినిఁగన్నవాని
తే. నక్కఁజఱచియునట్టాఁగి చెక్కలడఁచి, కలఁచి నీరుగఁ జేసి నల్గడలయందుఁ
గడిమి నెంతయుఁ జెలఁగుచుఁ గలయ మెలఁగి, యుబ్బుఁ జిన్నవేంకటపతిగబ్బియసము.

క. చినవేంకటపతినరవరు, ఘననిర్మలతేజమలరుఁ గర్ణాటమహీ
వనజాయతాక్షి మైఁబూ, సిన యభినవకుంకుమంబు చెలువుదలిర్పన్. 353

మ. పరమప్రీతి జిలెల్లనారపమహీపాలేశుసత్పుత్త్రిఁ దా
మరసాక్షిం దిరువెంగళాంబ నరిసంహారైకశూరుండు భా
సురధైర్యుండగు చిన్నవేంకటపతిక్షోణీంద్రుఁ డుద్వాహమ
య్యె రమన్ బన్నగరాజతల్పుఁడు వివాహంబైనచందంబునన్. 354

క. మతిచేఁ గమనీయతరా, కృతిచేఁ బతిభక్తిచే నొగిం దగనాభా

రతికిఁ రతికిని సతికిని, నతిశయమయినతిరువెంగళాంబికయందుఁ. 355

మ. జననంబందిరి చిన్నవేంకటమహీశస్వామికిన్నందనుల్
ఘనచారిత్రుఁడు తిర్మలాధిపుఁడు సంగ్రామార్జునుండంచు భూ
జనసంస్తుత్యతఁ గాంచువేంకటపతిక్ష్మాజానియున్ధర్మవ
ర్తన రాణించుసిరంగరాయమహుజాన్యక్షేశుఁడన్నవ్వరుఁ. 356

క. కృతినొందుఁగుటయరసేరణన, హితమతి మనుచుట కవీంద్రులేమడిగిన స
మ్మతినిచ్చుట చినవేంకట, పతితిరుమలన్నపతికెప్పుడుఁ బాయనిగుణముల్. 357

సీ. గోపాలమూర్తియాగోపాలభూపాలచంద్రుఁడు దనమురాజ్యంబునకును
బట్టంబుఁగట్టిన బాహాబలస్ఫూర్తి మెఱసి సర్వంబున ధరణియేలి
వర్ణాశ్రమంబుల వరుసతో నడపుచు సీతిబాధలులేక ప్రీతి జనులు
సంపదలనుదేల సవనోత్సవంబులు దఱుచుగానూరూర జఱుగుచుండ

తే. సకలనరనాయకులుగనుసన్న మెలఁగఁ, దనకు వేలూరు నిజరాజధాని గాఁగఁ
బరఁగెఁగడుఁజిన్నవేంకటపతికుమార, రత్నమైనట్టిశ్రీరంగరాయమౌళి. 358

క. దిమ్మరివైరులఁబోరిగొని, కొమ్మనుచునుబసిఁడి వేలకోలఁదులుఁగా ని
త్యమ్మునుగవులకునొసఁగుట, నిమ్మగు శ్రీరంగమానవేంద్రునిగుణముల్. 359

సీ. ధాటీనిరాఘాటఘోటకోద్ధతపాంసుపటలంబు నభముఁబొఱఁజల్లి
బంధురతరగంధసింధురనికరశీకరము నిబ్బరముగఁజిలికి చిలికి
వితతదోర్బలవిజృంభితయోధశరకరాళకాండాహతులఁజాల బెండువఱిచి
వీరరసావేశఘోరసద్భటులను ఘట్టనలనుజాపముట్టువెట్టి

తే. యుదయగిరిదండవెలుఁగొండుచుండుకుతువ, శాహుబలదర్ప దవహుతాశనునినడఁచి
వినుతిఁగాంచెను సకలభూజనులచేత, రమ్యగుణహారి శ్రీరంగరాయశౌరి. 360

సీ. మామమామగువానిమామనుగన్నయ్యకూరిమిమనుమనికొడుకుకొడుకు
కొండలదొరపట్టి కొడుకు తేజీమేఁలె మేఁతమూఁగువానిమేటితాత
తోలుఁబల్కుగుత్తాలఁదోలెడునాతనిమనుమనిమనుమనిపగతుసుతుఁడు
బిడ్డగేస్తునితండ్రిబిడ్డనిమామన్నకొడుకునుక్కడఁచినకడిఁదిమగఁడు

తే. దానగుణమున వితతప్రతాపమునను, జక్కఁదనముననసహాయసాహసమున
సాటియగుఁగాకయితరులసాటియెటులఁ, జేయఁగావచ్చు శ్రీరంగరాయమణికి.

క. శ్రీరంగరాయశశి గొ,బ్బూరికులుండైనవెంగళోర్వీశుతనూ
జారత్నముఁ బాపమ్మన, పారవిభవమలరఁగా వివాహంబయ్యెఁ. 362

సీ. మతి పోచిరాట్కులమండనుండగు వెంగభూనాయకాగ్రణిపుత్త్రి యైన
రాఘవమ్మను బోచిరాజువేంకటరాజుతనయ వెంగమ్మనుద్వాహమయ్యె
నాసతీత్రయమును ననురక్తితో సర్వధర్మసహాయమై తగ భజింప
నతిశయభోగభాగ్యాభివృద్ధినిఁ జాల రాజించి ధర్మమార్గప్రచారి
తే. యనుచు విద్వజ్జనంబులు వినుతిసేయ, వెలసె నెంతయు నసహాయవిక్రమాఖ్యుఁ
డారవీటిపురాధీశుఁడైన చిన్న, వేంకటపతీంద్రుశ్రీరంగవిభుఁడు మిగుల. 363

సీ. దరముతోఁ జీనికర్పూరముతో ధవళకంధరముతోఁ జోడుగాఁ దనర మెలఁగి
శరముతోఁ దుహినభూధరముతో ఋక్షవిసరముతోఁ బ్రతియనఁ జాల మెఱసి
హారంబుతో ముత్యపుసరంబుతో దైవతతరులతో ననురక్తిఁ దగ నొనర్చి
రాజుతో నింద్రేభరాజుతోఁ బన్నగరాజుతో నెనయగు రంగుఁ బూని
తే. దశదిశాత్యంతపరిపూర్ణతను వహించి, రహిని వెలసెను శ్రీరంగరాయమౌళి
ధాళధళ్యప్రభామానధవళకీర్తి, కవిజనాధీశవర్ణనగడుఁ జెలంగ. 364

క. ఇట్టిగుణంబులఁ గలతోఁ, బుట్టువులనురక్తిఁ గొలువఁ బోరుల రిపులన్
గొట్టి మనుమార్గచర్యకుఁ, బట్టగుచును వేంకటేశపార్థివుఁ డలరున్. 365

చ. కుటిలవిరోధిరాజమదకుంజరసింహకిశోరమూర్తి వి
స్ఫుటహరిభక్తితత్పరుఁడు పూరుకులీనుఁడు ధర్మవేది వేం
కటపతిరాయశేఖరుఁ డగణ్యగుణాకరుఁ డమ్మహాత్మునిం
బటుమతియా బృహస్పతికిఁ బన్నగభర్తకు నెన్న శక్యమే. 366

సీ. తా భుజింపఁగ లేక తలఁగ వడ్డించినయన్నంబు సతతంబు నమ్ముకొనుట
పారి బీదతనమున నొరులకుఁ దనసొమ్ము పుడకమాత్రంబైనఁ బోరయనీక
యొకటికి రెండుగా నొగి వడ్డి రాఁబట్టి ధనమెల్ల మూలలను దాఁచుకొనుట
తనుఁ జూడవచ్చినఁ గనికరంబును లేక కలసొమ్ములెల్లను గిలుబుకొనుట
తే. మానెనేనియు నెనవచ్చు మానితాన్న, దానవితరణభోగప్రజానురంజ
నపరుఁడైనట్టిచిన వేంకటపతి వేంక, టపతికి నినల శ్రీనేంకటపతి యరయ. 367

చ. జలరుహబాంధవాత్మజుఁ డొసంగును రేఁపటిపూఁటభక్తితోఁ
గలువలరాయఁ డిచ్చు నొడికంబుగ మాఁపటివేళ వేడ్కచే
నెలమి నొసంగు వేంకటపతీంద్రుఁడు రేఁపును మాఁపు నర్థిన
ర్థులకు సమస్తవస్తువులు దోరముగా ననివార్యదాతృతన్, 368

సీ. వైభవంబున నెనవచ్చును సుమేరుగిరితో భీతి డాఁగకయున్న భిదురపాణి
సౌందర్యమునఁ గొంత సరిపోవుఁ బురహరు కనువెచ్చఁ గనకున్న మనసిజుండు
గాంభీర్యమున నీడు ఘనరాఘవాశుగాగ్రమున నిర్వ్రీక యున్నఁ గంధిరాజు
కాంతినిఁ బ్రతియౌ మఖధ్వంసిపదహతిఁ గందుఁ జెందకయున్నఁ గమలవైరి
తే. యనుచుఁ జతురంబునిధివేష్టితావనీశ, సభలఁ గవిజననికరంబు లభినుతింప
నలరు నార్వీటిపురవరాధ్యక్షుఁడైన, రణజయవిహారి వేంకటరాయశౌరి. 369

చ. ఇననిభుఁడైన వేంకటపతీశుఁడు దక్షిణబాహుపీఠినిం
పెనయ వహింప భూధరమహీనపరాక్రమరేఖ మించె భూ
జనములు సర్వసంపదలఁ జాలఁగఁ గల్గి సుఖింప నాగకూ
ర్మనగవరాహభోగులకు మానుగ నూఱటగల్గె నెంతయున్. 370

సీ. ఆగమోక్తసుదక్షిణాన్వితముగఁ జేయు సరవితో దశదశసవనములను
బర్వములను భూసురవర్యులకిచ్చు నదటుచుగా బహువిధదానములను
ఆరూఢిగాఁ గనూరునను బెట్టించు సుప్రసోపేతాన్నసత్త్రములను
కనకగోపురసప్రకలితంబుగా వేడ్కఁ గట్టించు దేవతాగారములను
తే. రాజమాత్రుండె ధరణీవరాహబిరుద, వినుతుఁ డాత్రేయగోత్రపవిత్రుఁ డౌన
తారికోటీరరుగ్భ్రాజితాంఘ్రిధామ, రసుఁడు వేంకటపతిరాయరాజవాళి. 371

సీ. నెఱయాఁగిబలుఁ జెట్టునిగనిగల్గడునవ్వి రిక్కలదొరరంగు స్రుక్కఁ జేసి
జగడాలముని తేనిజిగిఁ గేరి వినువాఁక చాయలనిటునటుఁ బాయఁ ద్రోచి
పల్కుఁ జెల్కలకొల్కి తళ్కులగమి మించియంచలమైసిరిఁ గొంచెపఱచి
తెరగంటి యొకిమీని తేజసొంపును గెల్చి పాపరాయని పసఁ బాఱఁదోలి
తే. ప్రొద్దుకడవేళఁ బూచు నాపూవుతావి, కళుకుఁ బుట్టించి చౌదంతి యనువుఁ దెగడి
కడిమి నలుగడలందు వేంకటపతీశ, నసము మిగుల మేలనఁగఁ జెన్నలరుచుండు. 372

ఉ. ఇమ్మహియందు వేంకటపతీంద్రునభోమణి సాటియౌ ప్రతా
పమ్మనివార్యతన్నెలఁగి బంధురమై నలుదిక్కులెల్లనుం
గ్రమ్మిన దుర్జయాహితధరావరులెల్లను భీతిచే దివాం
ధమ్ములఁ బోలి డాఁగిరి మదంబులడంగి గుహాంతరంబులన్. 373

సీ. రాజాధిరాజవీరప్రతాపాంకుఁడౌ వేంకటపతిరాయవిభుఁడు వేడ్క
నూరపక్ష్మపక్షిణీశుసత్పుత్రి నప్పలాంబను నమరాద్రిధైర్యుఁ
డనఘుండు పోచిరాజాన్వయుండగు రఘునాథరాజేందు నినందనలను
విమలసచ్చారిత్ర వెంగమ్మ పద్మాయతాక్షి కోనేటమ్మ యనననిరువుర

తే. నొగి వరించెను సతులను ముగురియందు, నశ్వినియునాదియగుతారకాళిలో ర
మణుని యనురక్తిఁ గాంచురోహిణివిధమున, నలరుఁబతిమన్ననలనప్పలాంబ మిగుల.

ఉ. అంబుధిబద్ధభూస్థలిని నారసి చూచిన దీటు లేదుగా
యంబుదవేణులందు సుగుణావళిచేతను యానధూతకా
దంబకుఁబోషితాశ్రితకదంబకు నాస్యనిరస్తశీతరు
గ్బింబకు భద్రదప్రథితకీర్తివిడంబకునప్పలాంబకున్. 375

క. దీనులను బ్రోచు సతతము, మానకృపారసనిగుంభితోజ్జ్వలమతియై
జానుగనిల వేంకటపతి, భూనాథునియప్పలాంబ బుధనుతులెసఁగన్. 376

సీ. తాలిమిచే భూతధాత్రికిఁ బ్రతివచ్చు వాగ్వైఖరిని సరస్వతికి హెచ్చు
సత్యవాక్పాలిని సత్యభామకునీడు వైభవంబుననిందిరవనితజోడు
మాంగల్యమున సర్వమంగళకెనఁజాలు భద్రసంపదఁగల్మిపడఁతిఁబోలు
నన్నదానంబునన్నపూర్ణకుసాటి పతిభక్తినరుంధతికిఁబోఁటి
తే. యనఁగఁబొగడొందునుభయాన్వయంబులకును, వన్నెవాసియుఁగలుగంగవసుధనార
వీటి వేంకటపతిపృథివీవరాప్తు, తాంశునర్ధాంగలక్ష్మియానప్పలాంబ. 377

క. వారిరువురుగనిరనఘుల, వీరాగ్రణి రామరాజవిభునిన్ శౌర్యో
దారుండనఁదగుతిమ్మధ, రారమణుని వేంకటాద్రిరాజవిడౌజున్. 378

తే. ఘనతరాన్యోన్యమోదంబుగలుగ మెలఁగి, చెలఁగుచుండెడియారాజసింహవరుల
యన్నదమ్ములసౌభ్రాత్రముభినుతింపఁ, జిలువరాయనికైనను నలవియవునె. 379

సీ. కమలాతనూభవాకారరేఖనుబొల్చి సతులను మోహావసతులఁజేయుఁ
గవనగాంభీర్యవిఖ్యాతిని రాణించి పరులను సురవధూవరులఁజేయు
దేవతాభూజవితీర్ణినిఁదనరుచుఁగవులసంపన్మహార్జవులఁజేయు
వినుతసద్ధర్మప్రవీణత్వమున మించి జనులను సన్మోదఘనులఁజేయు
తే. ననుచు వినుతింతురఖిలనరాధిపేంద్ర, సభలనెప్పుడు సత్కవీశ్వరులు వేడ్క
లలరనెంతయునార్వీటికులపవిత్రుఁ, డైన వేంకటపతినృపాలాఢ్యునెలమి. 380

సీ. ఘనధర్మసద్గుణకమనీయుఁడగుటనో పలుకు రామామోఘబాణమయ్యె
వర్ణితమిత్రానువర్తనంబవుటనో పృథివీభరణమిందురేఖయయ్యె
ఘోరారికర్ణవిదారణంబగుటనో సాహసంబింద్రజోత్సాహమయ్యె
వరవర్ణినీమనోహరవృత్తియౌటనో సోయగంబు సుమాస్త్రుచాయయయ్యె
తే. నౌర పరిపంథిరాజగర్వాంధకార, నలినహితుఁడైనతిమ్మభూనాయకునకు

ననుచుఁ బొగడుదు రఖిలనృపామృతాంశు,లహరహంబును ముదితాత్ములగుచుఁ జెలఁగి.

క. రామునకు లక్ష్మణుఁడు సు,త్రామునకుఁ ద్రివిక్రమాభిధానుం డట్లా
రామాధిపునకుఁ దిమ్మధ, రామండలపతి మహోనురక్తిగ నెలఁగున్. 382

సీ. కరుణారసార్ద్రితసరివచ్చునొక్కింత పదినూఱు చేతులఁ బఱఁగువాఁడు
వైభవంబునఁ బ్రతివచ్చు నుపరికింప నొకసహస్రముకన్నులొనరువాఁడు
క్ష్మాభారభరణదక్షత నెనయఁగఁ జూడ దశశతాననములఁ దనరువాఁడు
పరమతేజంబునఁ బాటియౌ నెన్నంగ వేయికరంబుల వెలయువాఁడు
తే. గాక యితరుల నెటు దీటుగా నుతింప, వచ్చు మనుమార్గచరితుఁ డవార్యబాహుఁడును.
శౌర్యుఁ డంభోధిగాంభీర్యుఁ డార్యవినుతుఁ, డయిన యార్వీటితిమ్మభూపాఢ్యునకు

చ. పొడఁగనఁ దర్థి కర్థమిడి పోయెదమూరికినంచుఁ జెప్పని
ప్పాడెకదయిచ్చి నాపునక భూరికృపామతి వస్తువాహనా
లుడుగరలిచ్చి యన్నసుగుణోజ్జ్వలుఁ డార్వీటితిర్మలేంద్రుఁడీ
నడవడిగల్గునే శిబినృనాథదధీచులకున్న నిమ్మహిన్. 384

## ప్రహరణకలితవృత్తము.

చటులభుజబలశ్వసనజుఁడగు నా, ర్వీటితిరుమలభూవిభుపటహము ది
క్తటములవియనుద్ధతిచనఁ దనయం, తట భయపడి శాత్రవులిడుదురిన్. 385

## ఫలసదనవృత్తము.

నిటలతటమున బొమలు నిచి కలనియందా, ర్వీటితిరుమలన్నృపశశి వితతకర హేతి
స్ఫుటతఁ బఱపనరితతి పొలఁతులెడలింతెం,తట వనములకుఁ జనిరదలఁబడుచు భీతిన్.

## కుసుమితలతావేల్లితవృత్తము.

కోపై ఖడ్గాళివిద్యుత్తతి మిఱుఁగుర్లుగాఁ గానుపించున్
గోపోద్రేకప్రాకటమదరిపుక్షోణిపాలాంబురుట్టోచ్ఛ
భాపాళుల్వీడఁగ నలుదెసలం బర్వి యార్వీటితిమ్మ
క్ష్మాపాలాంభోజహితుబలపరాగంబు ధ్వాంతంబుఁ జేయున్. 387

సీ. పలుమాఱు వైరిభూపాలురరాజ్యసప్తాంగములఁట్టిల్క నాక్రమించు
జగజెట్టివలెఁ జేరి జలకట్టిగతిఁ దాఁటి చలపట్టి బుసకొట్టి చప్పరించుఁ
బుడమి దాలుపు వేయిపడగల ల్లాడంగ వడి మెట్టుఁ గిలకొట్టు బడలుపడఁగఁ
గడు మోరతోఁ బునూఁకుడుఁ జేసి కోఱాడి కొమ్ముల నెగఁదట్టుఁ జిమ్మిచిమ్మి

తే. కలఁచి కబళించి కడువడి బలిమి మించి, గెలిచియార్వీటి వేంకటక్షితిపుతిర్మ
లేందుభ్రివలమూఁపునను నిల్చియిరవుకొనియె, రాజనుతులొప్ప ధరణీవరాహమూర్తి.

మ. అనిలోనార్వీటితిర్మలాధిపుమహోగ్రాసిన్ రిపుక్ష్మాపగ్రి పా
వనలీలన్ రవి దాఁటి దేవగణికావాటింజరించిందు నృప
జ్జనుగూర్చుండిన మోవిగంటిఁగని లజ్జన్ రంభ కన్యాళిచే నా
ననమున్వంచె ఘృతాచి పూనిరి సునందామేనకల్మౌనమున్. 389

శా. భీతిన్నన్యపరాఙ్ముఖాహితనరుల్ భీమాటవీవాసులై
శీతోష్ణాదులకోర్చి యోగనిరతిన్ శ్రీరానిరాహారులై
చేతోజారి భజించుచుండటిలులై చిత్రంబు సంరక్ష సం
ప్రీతింగాంతురు రాయలాధిపునిమాశ్రీతిర్మలాధీశుచేన్. 390

తే. చేఁదు దిగ మ్రింగి నెలఁదలఁజేర్చినట్టి, హరునివలెనాశ్రితావగుణాళినవఁచి
గుణమొకింతయుఁగలిగినఁగొని గ్రహించు, రాయలాధిపుతిరుమలరాయశౌరి. 391

సీ. పరకాంతఁగన్నెత్తి భావించి చూడఁడు పరధనంబుఁదృణంబుపగిదిఁజూచుఁ
బరులదూషింపఁ డెప్పటికిని గల్లైన బొంకు నాలికయందుఁ బొడమనీఁడు
న్యాయమార్గమొకింత పాయ వర్తిల్లఁడు ధర్మమెవ్వలనైనఁదప్పఁబోఁడు
చాడిఁజెప్పిన వినఁడు సెన్నఁటికినొకింతైనఁగోపంబుపొంతఁజనఁడు
తే. విడువఁడాశ్రితరక్షయే వేళనైన, భరతనలన్నృగరామభూపతులఁబోలి
మేలిగొనములమేలిమి మెలఁగ మరిగి, భానునిభుఁడైనతిరుమలపార్థివుండు. 392

చ. సరసకళాప్రవీణుఁడతిసాహసుఁడంచితధర్మవేది భూ
సురవరపోషి దాని రిపుసూదనుఁడద్వయతానువర్తియీ
శ్వరభజనాతిసక్తమతి సాధుజనాదరణుండటంచును
ర్వర నుతిఁదిర్మలక్షితిపవారిజమిత్రుఁడుగాంచె నెంతయున్. 393

సీ. కట్టించె నేరాజు గగనంబునొఱయ విరూపాక్షప్రాగ్ద్వారగోపురంబుఁ
బెట్టించె నేన్నృపభిదురపాణి హృద్యిష్టమృష్టాన్నసత్రంబునీశుఁగూర్చి
చేయించె నేపుణ్యశీలుండు ద్విజులకు నడుగులు పెండిండ్లు కడు ముదమునఁ
గావించె నేమహీకాంతుఁడు ముప్పొద్దు పంపాధిపతికి సపర్య భక్తిఁ
తే. దలఁచు నేధన్యుఁడాత్మనుదనకుఁగలుగు, మానితైశ్వర్యమీశ్వరాధీనమనుచు
నతఁడు మనుజేంద్రమాత్రుఁడె యధిపమౌళి, రాయలాధిపుతిరుమలరాయమౌళి.

ఉ. ఆరవీటితిరుమలాధీశ్వరుఁడు రాము, భద్రకథ లఘుద్విపదనొనర్చ

పరమభక్తినాప్రబంధంబు శ్రీవిభూ, పాత్తుపేరఁజేసెనంకితముగ. 395

సీ. శ్రీరంగనాథుఁగవేరజాతటమున మును ధర్మవర్మప్రార్థననొనర్చి
నిలిపినవైఖరిని మహీధరశ్రేష్ఠమైనకిష్కింధాభిధానదివ్య
నగభేదియై రమానాయకదేహశ్రమాంబుస్వరూపంబుననఘమూర్తి
యగుతుంగభద్రామహానది మధ్యమశ్రీరంగమందిరక్షేత్రమునను
తే. క్రముకముఖభూజముల మల్లికాప్రభృతిల, తాళిఁగలవనమును వేసియాయుపవన
సీమయందును శ్రీరంగధామునునిచె, రాయలోర్వీశతిరుమలరాయవిభుఁడు. 396

తే. చెఱువు నల్లిండ్లు వనము నిక్షేపదేవ, భవనసత్కృతిసుతులనఁబరఁగుసప్త
సంతతులఁగాంచె వరుసను క్ష్మాజనములు, పొగడనార్వీటితిరుమలభూభుజుండు.

చ. అరుదగులీలఁదిర్మలనృపాధిపుసద్గుణశీతధారుణీ
ధరమునఁబుట్టి సర్వవిబుధప్రణుతుల్పలఁగంగ దేవతా
నరఫణిలోకముల్గలయ నవ్యరతిన్విహరించి రాజశే
ఖరశిరమానహించుటనుగాంచెనుగీర్తి సురస్రవంతియుక్. 398

సీ. గంధసింధురజాసైంధవవీరగణంబులు బుత్విగ్జనంబుగాఁగ
దిగ్గజకర్ణబాధీకరసుభటాట్టహాసముల్వేదమంత్రాళిగాఁగ
దళితాహితాశ్వమత్తగజభటాలంకృతధరాతలంబు వితర్దిగాఁగఁ
జండతరాటోపమండితపరిపంథిరాజవరులు పశుప్రతతిగాఁగ
తే. భూతబేతాళదేవతాప్రీతిగాఁగఁ, జటులసంగరసవనవ్రజంబొనర్చి
వినుతికెక్కెను ధరనునార్వీటితిరుమల, భూమిపాలుప్రతాపాగ్నిసోమయాజి. 399

తే. పటుయశోనిధి చిన్నవేంకటపతీంద్ర, వీరవేంకటపతిరాయవిభుతిరుమల
నృపతి జిల్లేళ్లకొండమహీవరాఢ్యు, తనయయైనట్టికోనేటమ్మను వరించె. 400

క. అనసూయతార్యతాశుచు, లనసూయాశచిసుధాంశునజ్జముఖుల దీ
టననారవీటితిరుమల, ఘనుకోనేటమ్మ వినుతిఁగాంచె ధరిత్రిన్. 401

సీ. సన్నుతికెక్కినసతతాన్నదానంబుపోఁడిమినాయన్నపూర్ణ సాటి
గణుతింపఁదగినట్టికడుఁదాల్మిగొనమున జలరాశిమేఖలాలలన సాటి
సంస్తుతింపఁగఁదగుసర్వలక్షణములఁబాలేటిదొరముద్దుపట్టి సాటి
వినుతికిఁజాలినవిమలమాంగల్యతఁజలిమలఁబొడమినచెలువ సాటి
తే. గాకయితరమహీనాథకామినులను, సాటియనవచ్చునెట్టులార్వీటితిరుమ
లక్షితీశ్వరునర్ధాంగలక్ష్మియనఁగఁ, బరఁగుకోనేటమ్మను బుధవరులసభల. 402

సీ. దుర్జయరాజన్యదోశ్శక్తులడఁగించి సర్వసర్వంసహాచక్రభార
ధరణదక్షత మహాప్రౌఢుఁడౌ శ్రీకృష్ణరాయలు నార్వీటిరామరాజ
తిరుమలరాయాదిధరణినాయకులును వారలదేవులు వసుధఁగీర్తిఁ
గనెనె యాకీర్తికి జననంబు ఘోషితకవిజనసన్నుతిగాదె యట్టి
తే. కవిజనాధారవిఖ్యాతిఁ గాంచి మిగులఁ, గవులఁ బోషించి తన్నుతి కబ్బములను
దింపవెలసెను నార్వీటితిరుమలకు, మాపెంద్రకోనేటమ్మ మహిని మిగుల. 403

శా. దీనత్రాణుఁడు తిమ్మరాజమహిభృద్దేవేంద్రుఁ డుద్యద్భుజా
నూనస్ఫారబలాహతాహితమహోత్సాహుండౌ పోచిరా
పృథ్వీనాథోత్తమరామరాజతనయన్ బూతాత్మఁ దిర్వేంగళాం
బానారీమణి నగ్నిసాక్షిగను జేపట్టెం బ్రమోదాత్ముఁడై. 404

క. ఆమదిరాత్ములు తిమ్మ, క్ష్మామండలపతియు మనిరి సౌఖ్యోన్నతులన్
శ్రీమేదినులను వారిబలెఁ, బ్రేమలు చిత్తముల మిగులఁ బెనఁగొని నిగుడన్. 405

మ. అమరాహార్యసమానధైర్యుఁ డరివర్యధ్వంసి సద్వైభవా
నిమిషేంద్రుం డనఁగ తిమ్మరాజమణి కోనేటమ్మ శ్రీరంగభూ
రమణున్ శ్రీచినవేంకటక్షితిపునిన్ రాజద్గుణాంభోనిధిం
బ్రమదంబొప్పఁగఁ గాంచి రంతయు బుధవ్రాతంబు గీర్తింపఁగన్. 406

చ. ఎలమినిఁ దిమ్మరాయవసుధేశుసిరంగనృపాలవర్యుఁడు
జ్జ్వలవిజయాతిశౌర్యవరవైభవవర్ణితరూపచండదో
ర్బలమహనీయదానగుణరాజితకాంతులఁ గేలిసేయునా
బలరిపుపుత్రసింహాసురపాలరతీశబలాబ్ధచంద్రులన్. 407

క. కురుకులమణియగు శ్రీరం, గరమానరుయశము దీటుగాఁ బూననుదా
సరిగాకుండఁగ శారద, సరసిజభవవదనజలజసదనములందున్. 408

సీ. పరమవైభవమునఁ బ్రతివచ్చునొక్కింత చుక్కపేరిటినాఁతిసుతునితాత
విక్రమోదగ్రత వినుతింప సరివచ్చుఁ జుక్కపేరిటినాఁతిసుతునితాత
గాంభీర్యగుణమున గణుతింప సరివచ్చుఁ జుక్కపేరిటినాఁతిసుతునితాత
యధికబలంబున నరయనుద్దవచ్చుఁ జుక్కపేరిటినాఁతిసుతునితాత
తే. కాకయితిరుపనెటు దీటుగా నుతింప, నచ్చునార్వీటిపురవంశవర్ధనుండు
విమతగజసింహుఁడగు తిమ్మవిభుతనూజ, చిన్నవేంకటపతిరాయశీతఘృణికి. 409

మ. అనిఁ దిమ్మాధిపుచిన్నవేంకటనృపాధ్యక్షుండు గీర్వాణరా
ట్తనయుండంచును మార్కొనన్ వెఱచి యార్తత్రాణపారీణుఁడీ

ఘను సేవించుట యుక్తమంచు రిపుభూకాంతుల్ మదేభాశ్వమం
డనముల్ దెచ్చియొసంగి పెట్టుదురు దండంబుల్ వినీతాత్ములై. 410

మ. ఇలఁదిమ్మప్రభుచిన్నవేంకటధరిత్రీశోరుసత్కీర్తినిన్
గలధౌతాద్రిని నాగిరీంద్రమున నక్షుంబాబ్ధిపాథీశుపైఁ
జెలువొందన్ శివునాగిరీశుతలపై శీతాంశునిన్ గంగనున్
దులలోనిట్లజుఁడుంచి తూఁచ ములదాఁకోమన్ యశంబున్నెడన్. 411

తే. ఇట్లు నుతియుక్తమిల నుతికెక్కియునుఁగుఁ, దమ్ముఁడౌతిమ్మభూభర్త నెమ్మిఁగొలువ
రాజకులమణి కోదండరామవిభుఁడు, దనరుఁగర్ణాటరాజ్యపదస్థుఁడగుచు. 412

క. ప్రణుతపరాక్రమతిగ్మకి, రణుఁడార్యనుతుండు సకలరాజమకుటస
న్మణిరంగదంఘ్రిభాసుర, గుణియౌరామవిభుఁబొగడ గురునకు వశమే. 413

క. వనజాహితకులుఁడగు శ్రీ, చినవేంకటపతినృపాలశేఖరునకుఁదా
మునుగరుణ వచ్చి వచియిం, చినయట్టివరంబొసంగుచిత్తముతోడన్. 414

సీ. జగములుగంపింప సాహసవృత్తిని వనితకై ధర్మవిధ్వంసియగుట
పట్టాభిషేకవిఫలతనొందియు జటివేషియై వనముప్రవేశమగుట
యపరాధియగువానిననిలోనఁదుంపలేకర్కతనూజుతో డాసపడుట
చెలఁగి మదిని వచింపక మిగులఁబుణ్యజనౌఘవంశసంహారియగుట
తే. పరిహరముగాఁగ ధర్మతత్పరత రాజ్య, మేలి యసహాయశూరత నెసఁగి ప్రజ్ఞ
జనుల రక్షింపఁగోరి దాశరథి వేంక, టాద్రిపేంద్రునిరామరాజై జనించె. 415

సీ. ఎంతఁజల్పినమనవెంతఁజేయుటె కాని యంతలేదనుటయావంత లేదు
సజ్జనసాంగత్యసరణినుండుటె కాని యితరమార్గమొకింత లేదు
ప్రాకటసుకృతసంగ్రహబుద్ధియే కాని నీతిదూరంబైనరీతి లేదు
పరధనంబు తృణంబుపగిదిఁగాంచుటె కాని మోహమెత్తి చూచుట మొదలె లేదు
తే. దుష్టనిగ్రహమొనరింపఁదొడరుఁగాని, పరుగుణదోషమెన్నుటవలను లేదు
రాముఁబోలినసుగుణాభిరాముఁడైన, వేంకటపతీంద్రురామభూవిభునికరయ. 416

సీ. అలసటచేనైననన్నృతమౌమాటాడఁడాడినమాట శిలాక్షరంబు
మఱచియైననునసన్మార్గవర్తనలేదు వర్తిల్లు ధర్మప్రవర్తనంబు
కలనైననొరులనునలుకతోఁజూడఁడు చూచిన సంతతశుభకరంబు
నలయికలోనైననర్థికీయఁడు కొంచెమిచ్చిన దారిద్ర్యమెల్లఁదొలఁగు
తే. నెప్పటికినైనఁ బ్రజలకత్యంతయంత, సంతసమెకాని వేరగుచందమొందఁ

దనుచు శరనభినుతిఁ గాంచియుండునార, వీటి వేంకటపతిరామవిభుఁడు మిగుల. 417

సీ. సదయప్రవర్తన శౌరిదాఁ బ్రతినచ్చు నరసారథియనంగఁ బరఁగఁడేని
ఘనగుణస్ఫూర్తి సాగరుఁడుదానెనయగు విషధినామంబున వెలయఁడేని
కాంతిని రోహిణీకాంతుండు సరిఁబోలు దోషాకరాఖ్యతోఁ దొడరఁడేని
సర్వజ్ఞతను ద్రిలోచనుఁడు చూడఁగనొప్పఁ దామసగుణముఁ దాఁదాల్పఁడేని
తే. యితనికనుచును బుధతతుల్ నుతియొనర్పఁ, దనరు నెంతయు లోకైకధన్యుఁడఖిల
వసుమతీభారభరణనిర్వాహకుండు, వేంకటపతీంద్రు రామపృథ్వీవరుండు. 418

మ. వనజాదిప్రసవాశుగంబులు శుకాశ్వంబిక్షుచాపంబు మీ
ననకోదగ్రపతాకఁ గాంచి ధరకున్ రాఁబోవులక్ష్మీసుతుం
డని భావింతురు నెమ్మనమ్ములను మోదాభ్రాంతిచే భామినుల్
ఘను రామక్షితిపాధ్యునార్తజనరక్షాదక్షు నెల్లప్పుడున్. 419

లయగ్రాహి.

దిక్కుల జయించుమది నెక్కుడుగ రామపతి పెక్కగుబలంబులిరుచక్కిఁ గొలువంగా
నొక్కపయనంబుసననిక్కడికి రాఁదలఁచునిక్కమిది వార్తవినికెక్కుడగుశూరుం
డొక్కరుఁడుగల్గఁడిప నెక్కడివిచారములు మ్రొక్కికొలువన్ వలెను స్రుక్కివనసీమన్
ద్రొక్కవలెఁ గాలగతులక్కరణి వచ్చుహరి దిక్కనుచు బీరములు దక్కుదురు వైరుల్.

సీ. ఘనఘనాఘనసముత్కరపతితాశని ఫెళఫెళారవముల బెట్టు గెలిచి
ప్రళయకాలోగ్రభైరవకరఘంటికాఘణఘణధ్వనులనుగడు హసించి
పృథునృహర్యక్షవిభిన్నోన్నతస్తంభపటపటార్భటులను బరిహసించి
ఘోరహేమాక్షవిదారణోద్ధతకిటిఘుటఘుటస్వనములఁ గొంచెపఱచి
తే. ధరను వెలసెను రిపునృపధవవధూని, కాయములగర్భనిర్భేదక్రమవిహార
గౌరవంబార్యులెంచంగఁ గాంచి రామ, ధారుణీనాథుభూరిభేరీరవంబు. 421

చ. పరధరణీశరాజ్యముల బల్విడి రామనృపాలుసేన స
త్వరమునఁ నాక్రమింపఁ జనఁ దత్పదరేణువు దిక్కులందునం
బరమున నిండఁబొల్పెసఁగె భాస్కరుఁడుం బగలింటిదీపమై
యరయఁగ ధూళిధూసరితమయ్యె నభశ్చరకుంతలాగ్రముల్. 422

శా. ఉష్ణారోహణుఁడై దిగంబరుఁడునై యుగ్రాంశుఁడై పొల్చుఁగా
శిక్షేత్రంబునఁబోవువాఁడు చటులాజిన్ రామభూపాలకా
ధ్యక్షున్ మార్కొని తత్కరాసినిహతుండైనట్టివాఁడాసహ

ప్రాక్షేత్రేంద్రము నెక్కి సుత్రామసముండై దివ్యుఁడౌఁ జూడఁగన్. 423

మ. కనఁగాఁ జిత్రముగాఁగఁ జేయు రణరంగక్షోణియందున్న శ
త్రునృపాలావళి యర్కమండలముఁ జేదోపాడుచున్ దాటి వే
చని రంభాదినిలింపవామనయనాసంఘంబుతో నెప్పుడున్
ఘనదాంపత్యము నొందె రామమహీభృత్ఖడ్గాబ్జజుం డెంతయున్. 424

ఉ. శ్రీకరమూర్తి రామనృపశేఖరుఁ డాజి విరోధిభూవరా
నీకముఁ ద్రుంపఁ దన్మకుటనిర్గతరత్నముల ప్రవాహినుల్
వేకొని పోయి నింపఁ బృథివిం బొగడంబడియెం బయోధి ర
త్నాకరమంచుఁ గాక కలవా మును వారిధియందు రత్నముల్. 425

మ. అనిలో రామనృపాలు బారిఁ బడి భృత్యామాత్యకాండాలవా
హనపుత్రాప్తుల డంగఁ గాంచి హతశేషారాతివర్గంబు భీ
తిని వింధ్యాదిమహీధరంబులను నెంతే డాఁగి గ్రాసార్థమై
వనితాయుక్తముగా వనేచరులలో వర్తించు నాకీతులన్. 426

శా. వీక్షింపంబడె రామభూవిభుఁడు దోర్వీర్యంబుచే మించి జ
న్యక్షోణిన్ రిపుకోటులందును మనత్యంతంబు తత్పంకజా
తాక్షుల్ దీనతరాత్మలై కురియుబాష్పాంబుప్రవాహంబు ప్ర
త్యక్షప్రక్రియ నాక్రమించి మరుదేశాంతంబులన్ మించుటల్. 427

ఉ. తామసులై బలాబలముఁ దాము దలంపక కన్ని నిచ్చ సం
గ్రామముఁ జేసి యోడి రిపురాజులు పుట్టలు గుట్టలెక్కి శ్రీ
రామనిజాంశసంజనిత రామమహీమహీకళత్ర జే
వా మముఁ గావవే యనిన వారల సత్కృప బ్రోచు నవ్వుచున్. 428

ఉ. రాముని హైహయుం బరశురాముని హైమవతీకుమారు సు
త్రామతనూజుఁ బోలిన పరాక్రమమున్ ఘనమందరంబుచే
రామవిభుండు శత్రుజలరాశి మథించుచు వేడ్కఁ గాంచెఁ ద
త్సామజఘోటకప్రముఖసంపదలెల్ల సురేంద్రువైఖరిన్. 429

## విజయసీసమాలిక.

శ్రీమన్మహాసుధాధామవంశంబుర్వి వినుతికెక్కఁగ నుద్భవించినట్టి
రఘురామమూర్తి యా రామరాజక్ష్మాపాలుండు జూటూరి బైట మున్ను
భండనభూమినిఁ బన్నినపగతురబారికి నవశిఖావారశౌర్య

గరిమచేఁ గరులను హయంబులఁ బదాతులఁ బోరిఁ గొని జయలక్ష్మిఁ బొందెనట్టు
లాసనమును పేరనమరినప్పురియొద్ద మైసూరివారలకు మాఱుకొనను
గణుతికి నెక్కెనగంధసింధురతురంగమవీరభటనికాయములు పెక్కు
గలదళముల వారిదళవాయి యైనకుమారయ్య చనుదెంచి బారుఁదీర్పఁ
గని కరిపుటఁగన్నకంఠీరవేంద్రునికైవడి మిగుల దుర్గర్వమెసఁగ
మేలైన కాసరకోట తిమ్మయ సబినీసు కృష్ణయ కార్యనిపుణుఁడైన
పట్టి వేంకటపతిమ్మాపాలుఁడాదిగాఁ గలదొరల్ చతురంగబలముతోడ
నిరుగడ వెనుక ముందఱఁ ద్రొక్కి నడవంగ ధరణీవరాహపతాక మెఱయ
బలరజంబంబుదపథసురకామినీబృందధమ్మిల్లంబులందు నిండఁ
జలుమాఱు వెచ్చుచుఁ గపహారేనుఁడు నాట్యమెలమితో నాడుచునిట్టిరణముఁ
గాననేరమిడ మును గౌరవపాండవుల్ పెనఁగిరికీలిని వినుతిచేయ
ఖడ్గమరీచులాకసము దిక్కులఁ గప్ప సుతహితబంధుసంతతులతోడఁ
గరులకుఁ గరులును హయలకు హయలును గాల్బలంబునకును గాల్బలంబు
దలపడి పోర శాత్రవసేనలుఱుకడించినప్పుడు గని నిజసేనఁ జెదర
నియ్యక పురికొల్పి ప్రాయ్యాలు గానని మొనఁజొచ్చి చించుచు మూలలుగను
జొరఁబారి మఱియును జుట్టువారక విశ్వరూపుఁ బూనిన శౌరిరూపు మాడ్కి
నరులకందఱకు నన్ని రూపంబులనక్కడక్కడ మొనకాని నిలిచి
శూలిపోలిక లయకాలునికైవడి మారిమసఁగుకీతి మాఱులేక
రెండవపార్థుఁ డీతండనననాలిఁ గంధుకక్రీడగాఁ గంధరములు
ధర డొల్లఁబడములు కరములురంబును బ్రక్కడొక్కనియే ఱుపఱుపరాక
వండమదశిగినట్లుండ గాత్రంబులఖండముల్ కుప్పలు గాఁగఁ గూల
విదళితద్విపమును వినిహతహయము నిపాతితవీరపదాతియును వి
ఖండితవాహవేదండచయారోహకంధరంబును విశకలితపాద
కర్ణనక్షోమస్త్రకంఠకరంబు విభ్రష్టకేయూరహారమును భూష
ణంబు విశ్రుతసింహనాదంబును విదార్యమాణగదాసితోమరరథాంగ
పరశుపట్టిసశూలపరిఘంబు వినిపాతచామరకేతనచ్ఛత్రమును వి
లీయమానతురగాళిఖురసముద్ధూతవిపులపరాగంబు విరహితాన
కారానకరటిఘీంకారఘంటాఘణఘణత్కారభూషణఝణఝణత్కారతురగ
కింకిణీనూపురక్రేంకారవీరభటానోన్యవ్యధికారవమాజిభూమి
యగుచున్నట్లుగాను మహాస్రప్రవాహముల్ ఛత్రయుతంబుగా సాఁగి పాఱ
శాకినీప్రముఖపిశాచజంబుకకంకవారంబులకుఁ దనివారఁ బెద్ద

పబ్బంబుగా వీరభటసామజాశ్వాళిఁ బోరిఁ గొని హరులనుగరులఁ బట్టి
శరణన్న నృపతులఁ గరుణతోఁ గాచుచుఁ బలుఁబడిఁ గొందఱఁ బట్టి విడిచి
కాందిశీకత నలుగడలకుఁ బాఱిన వెంటనంటక మళ్లి విడుపట్టుఁ
జూఱగాఁ గొని జయభేరులు మ్రోయంగ సైన్యంబులుభయపార్శ్వములఁ గొలువ
నిజశిబిరంబున నిండువేడుకఁ దలపూవు వాడక సుఖంబున వసించి
క్షితిసురౌఘమ్ములాశీర్వాద మొనరింపఁ బ్రమదలు నీరాజనములొసంగ
రామ రాజకులాబ్ధిరాకాసుధాకర రాజాధిరాజ వీరప్రతాప
రాజమార్తాండ సుత్రామసన్నిభ యాస్యదిగ్రాజభయదార్క తేజ రాజ
పరమేశ యనుచును భటకవిగాయకుల్ వినుతింపనసద్మశవిజయసమున

తే. బొండెఁగడు శ్రీవిరూపాక్షుభూరికరుణ, స్థిరముగా నెంతయును దనుఁ జేరినార
వీటిపురవంశమణియార్యవినుతచరితుఁ, డైనకోదండరామరాయనరవరుఁడు. 430

సీ. ఎల్లప్పుడునుగను లెఱ్ఱగాఁ జేసుక ఐడి మోరతోఁ బ్రనుగుడు లెగయును
గనుఁగొనుచూరక తనకుఁ దానడఁకుచు బుడబుడి కడుపులో ముడుచు మొగము
మదవృత్తి మేననుగ్గు దురఁ మూఁగుచు బయల్ సారెసారెకును జేబారలిడును
గాలానటించునేవేళనుజూచిన బుసకొట్టుచుండంట విసముఁ బెట్టు
తే. ననుచు భూదారతూర్మనాగాహిపరుఁ, బరిహసించుచు ధారుణీపరిసిజాక్షి
భామినీలోకనూతనపంచబాణు, రామరాజేంద్రునిమూఁపు రహి వహించె 431

సీ. ఘనమదోద్ధతవృత్తి కరిశాబకములంద గతివిభ్రమము రథాంగములయంద
పరపీడనము వీరభటసంకులములంద త్వరితలాఘవము సైంధవములంద
ధర్మవిధ్వంసంబు దారుణాహవమంద ఖరకరత్వము సాయకములయంద
భీషణారావంబు భేరిభాంకృతులంద యతిచంచలత మండలాగ్రమంద
తే. కాని తనయందుఁ బ్రజయందుఁ గానఁబడక, యుండ నేలెను ధారుణీమండలంబు
శౌర్యమున నాదిరాజన్యచర్య మెఱసి, రాజకులభూషణుఁడు రామరాజవిభుఁడు.

మ. కుముదాప్తాన్వయభూష రామవిభునిం గొల్వంగ నత్యాంతముం
గములై వచ్చి నిజాంకదుర్ధరపతాకల్ చాల శోభిల్లపా
శ్వములం జుట్టును డిగ్గి కాన్కలిడి హాళింబల్కులం జెయ్యువ్వరం
బ్రమదం బందఁగఁ జేయుచుండుదురు సర్వక్షోణిపాలాగ్రణుల్. 433

క. అనవరతకృతాధ్వరముల, ననిమిషులకు మిగుల మోదమబ్బరించుచుఁ గాం
చెను భూజను లెంచఁగ వరుసను రామవిభుండు సప్తసంతానంబుల్. 434

క. తేంఎడిగిననన,కి నంతయు నదిరామనరవరాగ్రణియొసఁగుఁ

సంతతవితరణరేఖా, చింతామణియనుచు బుధులు క్షితి నుతిచేయన్. 435

మ. అలరన్ రామవిభుండు శిక్షితమునై యార్యప్రజస్తుత్యమై
వెలయన్ స్వర్చనపూర్వధర్మవిలసద్విద్యావిశేషంబును
జ్జ్వలమైనట్టిగుణంబు నద్దెసలనున్ వ్యాకీర్ణమై మార్గణా
వళులెల్లప్పుడు సన్నిధిన్ మిగులనున్ వర్తిల్లఁ జిత్రంబుగన్. 436

మ. ఘనకర్ణాదులఁబోలు రామధరణీకాంతేశునౌదార్యమున్
గనియాశాంతసువర్ణభూధరములన్ గాపుంచికేశందునిలన్
దనరన్మెప్పద దేవతల్విబుధవిత్తప్రేమలేదిమ్మహా
త్మునకిట్లున్నను వీనిసేఁతని సురస్తోమంబు మోదంబునన్. 437

మ. వనపాలాయిదియేమి కల్పకము లేవన్ భూమిపై రాల్చెఁగ్రొ
న్ననలన్నన్ వినుమోశచీశ ధరణీనాథాద్యుఁడౌరామరా
జనిశంబర్థులకర్థినర్థమిడు మిత్రాత్మోద్భవున్ మీఁటియం
చును జెప్పన్ దలయూఁచి మెచ్చుచునటంచున్ దెల్పు వాఁడిందునితోన్. 438

చ. తిరముగ నెట్టికోఁకఁగటిఁదీర్ఘనిరాఘుఁడు కంఠసీమనున్
గరళముతేనిశంకరుఁడు కంటెదఁజెందనిశీతభానుఁడున్
సరియనుఁగాకయున్న నెటు సాటగునంచు జనంబులెంచఁగాఁ
బరఁగు ధరిత్రి రామనరపాలునికీర్తి మనోజ్ఞమూర్తియై. 439

సీ. ఘోరంపవైరిఘరారమణౌఘదోర్గర్వాంశుకాండంబుఁగడవ మాన్పి
దుష్టాహితేశవధూసంఘమానసేందీవరోల్లాసంబుఁబోవఁద్రోచి
దర్పితాజేయశాత్రవబలయామినీరాజమండలముసంభ్రమముణంచి
పరిపంథిమానవవనరచారువై భవప్రాలేయపటలంబుఁబాఱఁదోలి
తే. హితపయోరుహములకునింపెసఁగఁజేసి, ధీజనస్తుతిసెలఁగనద్దెసలు వెలుఁగి
ధరణిఁగోదండరామరాడ్ధరణిపాల, వరనిభూరిప్రతాపభాస్కరుఁడు చెలఁగు.

సీ. జగవెండిసరగంచుచెంగావివలువని కాంతిఁంతు గంతయుఁగట్టుకొనఁగ
శ్రీగంధమిళితకాశ్మీరపంకంబని తలపోయుదురు మేననలఁదుకొనఁగ
జాజులజతయైనసంపంగిదండని చూతురు కొప్పునఁజుట్టుకొనఁగ
ఘనహారపద్మరాగయుతభూషణమని ప్రీతిఁబొందుదురాత్మఁబెట్టుకొనఁగ
తే. ప్రేమసి తిరుగుదురిట్టుల దిగ్భ్రమలెప్పుడును జతుర్విధశృంగారమును ఘటింపఁ
గమలజాండంబునిండి చెల్వలరురామ, విభునికీర్తిప్రతాపములు వెలయుచుండ. 441

శా. కారుణ్యాంబుధి పోచిరాట్కులసుధాకంధీశుఁడర్థార్థి మం
దారుండై విలసిల్లుకృష్ణమనుజాధ్యక్షేంద్రుసత్పుత్రినాం
చారమ్మన్ వరియించె రామధరణీశస్వామి మోదంబునన్
క్షీరాంభోనిధికన్యనచ్యుతుఁడు మున్ జేపట్టినట్లుం బలెన్. 442

తే. రాజమణియౌజిలెళ్లతిర్మలరాజు, తనయ వెంకమదేవినుద్వాహమయ్యె
నారవీటిరామభూపాలకాగ్రగణ్యుఁ, డఖిలబాంధవనికరంబులభినుతింప. 443

ఉ. సూరపవంశవర్ధనుఁడు సూరిజనావనుఁడైనయోబధా
త్రీరమణీశునాత్మజ సుధీనుతనుగ్గమదేవినిన్ మహో
దారుఁడు రామరాజహిమధాముఁడు వేడ్కనుబెండ్లియయ్యె నా
గౌరిని మోదమొప్పఁగ గరకంధరుఁడున్ వరియించుభంగిగన్. 444

మ. కురువంశాగ్రణిరాయలాధిపుని శ్రీకోదండరామాఖ్యభూ
వరుఁడంభోజహితాన్వయాబ్ధిశశి శశ్వత్కీర్తియై పోచిరా
డ్ధరణీపాలునియచ్చిరాజుతనయన్ ధన్యన్నీలాలకన్
హరిణాంకాస్యను రాగమాంబను వివాహంబయ్యె మోదంబునన్. 445

ఉ. సంగరరంగభార్గవుఁడు సాధుజనావనుఁడౌజిలెళ్ళతి
ర్వేంగళనాథరాట్సుతను విశ్రుతధర్మగుణాలవాల సా
రంగధరాస్యనుగ్గమను రామవిభుండు వివాహమయ్యెను
ప్పొంగుచు సర్వబంధుచయమున్ దగునౌనని సన్నుతింపఁగన్. 446

తే. వెండియునుజిల్లెళ్లతిర్వేంగళేంద్రు, తనయయైనట్టినాంచారమను వరించె
నారవీటికోదండరామావనీశుఁ, డఖిలబాంధవసందోహమభినుతింప. 447

సీ. కావేరికాల్వలు గాఁదీర్చి కట్టించి కట్టినాతని పేరుఁగలిగి తనదు
కులమొప్పఁజేసినజలజాప్తవంశజుఁడగుచోళభూపాలునన్వయాబ్ధి
సోముఁడౌ వరదరాట్క్షోణీశునప్పలమానవాధీశుకుమారికఁ దిరు
వెంగళాంబను నారవీటివంశలలాముఁడౌ రాయలాధీశునగ్రతనయుఁ
తే. డఖిలరాజన్యమస్తకన్యస్తమకుట, మాన్యమణిరాజపాదతామరసుఁడలఘు
చరితుఁడైనట్టిరామరాడ్జనవిభుండు, పరిణయంబయ్యె బాంధవప్రణుతులెసఁగ. 448

ఉ. భానుని నెప్పుడింతయెడఁబాయనిఛాయయుఁబోలి రామభూ
జానిమనంబు రా మెలఁగి చాల సపర్యలొనర్చి మన్ననన్
మానుగఁగాంచి బాంధవసమాజముకొంగుపసిండనంగనా

మానవతీచయంబు గుణమండనసన్నుతిఁ గాంచె నెంతయున్. 449

చ. భరతకులప్రదీపుఁ డరిభంజనుఁ డంచితరాజధర్మత
త్పరమతి యారవీటిపురధాముఁడు రామమహీతలాధిపే
శ్వరుఁడు మదిన్ బ్రమోద మొదవన్ గనె నుగ్గమదేవియందు భా
సురసుకుమారునిన్ సుగుణశోభితు నింబెద వేంకటాధిపున్. 450

క. ఘనుఁ డగు రామనృపాలుఁడు, కనె నాంచారమ్మవలనఁ గడు మోదముతో
డను జినవేంకటపతినృప, వనజాహితు రాజవంశవర్ధను ననఘున్. 451

క. వెండియు నాంచారమ్మకు, మండితయశుఁడైన రామమనుజేశునకా
ఖండలసన్నిభుఁ డగు కో, దండమహీపాలతుహినధాముఁడు పుట్టెన్. 452

మ. రమితారాతిబలుండు రామమనుజేశస్వామి రాజాస్యరా
గమదేవీమణివల్లఁ గాంచెను మహాహ్లాదంబుతో ధన్యునిం
బ్రమదానూతనపంచబాణు సుగుణభ్రాజిష్ణుఁ బంచాస్యవి
క్రముఁ బాథోధిగభీరు వేంకటపతిక్ష్మాపాలకాగ్రేసరున్. 453

సీ. సంగీతసాహిత్యసరసవిద్యాప్రౌఢి రాజీవగర్భతనూజు భోజు
ఘనధర్మగుణగణాకాంతి నిస్తంద్రత రావణాంతకుఁడైన రాము సోముఁ
జంపతిరాటోపసౌందర్యవైఖరి క్ష్మాధరకన్యాకుమారు మారు
సకలభూధారణభుజాబలవిస్ఫూర్తిఁ బవనభుక్కులసార్వభౌము భీముఁ
తే. దెగడి ప్రహసించి యతికించి ధిక్కరించి, మించి సరిఁ బోలి ప్రతియయి మేటియగుచుఁ
దనరుఁ గోదండరామభూధవుని పెద్ద, వేంకటోర్వీశ్వరుం డార్యవినుతులెసఁగ. 454

చ. బలిసదనంబుఁ బొందుకొని పన్నగభర్తనిడంగఁ జేసి భూ
తలములు నాక్రమించెను సుధాజలరాశి మథించి నాకమున్
గలయఁగఁ బర్వ కల్పకముఁ దైకొనె నిట్లు జగత్త్రయంబునన్
వెలసెను రామరాజు పెదవేంకటభూపతికీర్తి వేడుకన్. 455

తే. అప్పు డుర్విఁ గోదండరామావనీశు, పెద్దవేంకటనరపతి పెండ్లియయ్యె
నెలమిఁ బోచిరాట్చినవేంకటేశుపుత్త్రిఁ, గోనమాంబను బాంధవకోటి యలర 456

సీ. సతతంబు నతిభక్తిఁ బతిసేవ సేయుచు నతులితసంపద యతిశయిల్ల
నత్తమామలపట్ల ననురక్తి నడచుచుఁ దోడికోడండ్రతోఁ గూడి మెలఁగి
పదినెలు మఱఁదండ్రు ముదమంద నల్లన మఱఁదులఁ దారతమ్యములఁ బ్రోచి
సుతులఁ బ్రీతినిఁ గాంచి హితబంధుబుధదాసదాసీజనంబుల దయను మనిచి

తే. పుట్టినిల్లును మఱిదాను మెట్టినిల్లు, నన్నెవాసినిఁ జెలఁగంగ మన్ననఁగనె
నారవీటి వేంకటపతిక్ష్మాధినాథు, కోనమాంబకు సాటి యేమానవతులు. 457

క. రతిమదనులన శచీంద్రుల, గతి సౌఖ్యములలర మనిరి కాకోదరరా
ణ్ణుతపెద్దవేంకటాద్రి, క్షితిపతి కోనాంబ విబుధకీర్తనలెసఁగన్. 458

సీ. హరిరాజహరిరాజహరిరాజులకు సాటి పటుబలాజ్ఞానూనభాషణముల
హరిహయహరిహయహరిహయులకు సరి వితతక్ష్మాసాహసవిభవములను
హరిసుతహరిసుతహరిసుతులకునైన వినుతజవౌదార్యవిక్రమముల
హరిపౌత్రహరిపౌత్రహరిపౌత్రులకుఁ బ్రతి సద్ధర్మవిజ్ఞానసాహసముల
తే. ననుచు నెవ్వని వినుతింతురఖిలవిబుధు, లరిమహీశ్వరశతకోటియారవీటి
వంశకలశాబ్ధిరాకామృతాంశుఁడతఁడు, పరఁగుఁబెదవేంకటక్ష్మాభర్తయెలమి 459

ఉ. ఆలములోన రామమనుజాధిపుమాపెదవేంకటావనీ
పాలుఁడుశత్రులందునుమఁబల్వురఁదద్రుధిరప్రవాహముల్
చాలఁగ వార్ధినించెనటుచాలునె భార్గవరాముసాహసా
భీలతయెంతదొడ్డయని పేర్కొననేనుమడుంగులే కదా. 460





చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1923.

# ఆంధ్ర ప్రబంధములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములు ,, ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, ... | 2 | 4 |
| ఆనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములుగల సంపుటము ... | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, ... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, ... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు, లక్ష్మణకవికృతము | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము ... | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో ముద్రితము ... | 0 | 10 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండువాల్యములు ... | 8 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

# ఆంధ్ర గ్రంథములు.

ప్రతి :

భోజరాజీయము, అనంతామాత్యకృతము ....
తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ....
బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము ....
హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము ....
చెన్నబసవపురాణము, పాపకవికృతము ....
పంచతంత్రము, నారాయణకవికృతము ....
ఆంధ్ర బ్రహ్మాండపురాణము ....
సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేక నూతనములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీకణము మిక్కిలివిపులము. ఇదివఱకు ప్రకటితమైనదానికన్న బాగుగనున్నది. సాధారణప్రతి ....
జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు ....
నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు ....
వైశ్యపురాణము, పద్యకావ్యము ....
ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ....
ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటు టీకానుక్రమణికాసహితము ....
అనంతునిఛందము, ఛందోదర్పణము ....
బిల్హణీయము, చక్కనికూర్పు ....
వైజయంతీవిలాసము ,, ....
రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ....
రసికజనమనోభిరామము ....
రాజశేఖరవిలాసము ....
వేమనపద్యములు, చక్కనికూర్పు ....
డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ....
డిటో (3060) ఆంధ తాత్పర్యముతో ....

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1.కి రూ. | అ. |
|---|---|---|
| భోజరాజీయము, అనంతామాత్యకృతము .... | 1 | 2 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు .... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము .... | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము .... | 0 | 14 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము .... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము .... | 0 | 12 |
| ఆంధ్ర బ్రహ్మాండపురాణము .... | 5 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలివిపులము. ఇదివఱకు ప్రకటితమైనప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి .... | 2 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు .... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు .... | 0 | 12 |
| వైశ్యపురాణము, పద్యకావ్యము .... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము .... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము .... | 0 | 12 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము .... | 0 | 14 |
| బిల్హణీయము, చక్కనికూర్పు .... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, .... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి .... | 0 | 8 |
| రసికజనమనోభిరామము .... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము .... | 0 | 8 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు .... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో .... | 1 | 4 |
| డిటో (3060) ఆంధ్రతాత్పర్యముతో .... | 3 | 8 |
| బాలచంద్రోదయము .... | 0 | 4 |
| అప్పకవీయము .... | 2 | 8 |

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | .... | 0 | 3 |
| ఆంధ్రభాషార్ణవము | .... | 0 | 12 |
| వసరాపద్యములు | .... | 0 | 2 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి | .... | 0 | 6 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | .... | 1 | 4 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | .... | 0 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | .... | 0 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | .... | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | .... | 0 | 4 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | .... | 0 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవి విరచితము | .... | 0 | 14 |
| రూపలి, రాజపుత్రస్త్రీసాహసపుకథ<br>శ్రీ ఎనమంద్ర నారాయణమూర్తిగారిది | | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | .... | 0 | 5 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | .... | 1 | 4 |
| డిటో రెండవభాగము | .... | 1 | 10 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | .... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద | .... | 0 | 14 |
| పంజాబుఅల్లరి, సహాయనిరాకరణోద్యమము దేశీయమహాసభ వారిచేనిర్మింపబడినకమిటీవారి రిపోర్టుననుసరించివ్రాయబడినది. ఇందనేకపటములుగలవు. | .... | 0 | 8 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | .... | 0 | 14 |
| మదనమోహన మాళవ్యగారి జీవితము, పంజాబుఅల్లరి | | 0 | 8 |
| ద్వాదశోపనిషత్తులు,సంస్కృతమునకు సరియైన తెలుగువచనము | | 3 | 0 |
| యజుర్వేదకథాసంగ్రహము | .... | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | .... | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.